శ్రీరస్తు.

ఉత్తర

# హరిశ్చంద్రకావ్యము.



ఇది

రత్నాకరం. అనంతాచార్యులు గారిచే

రచియింపంబడి

గుంటూరులోని సుప్రసిద్ధ న్యాయవాదులగు

శ్రీయుత ఏకా దండయ్యపంతులుగారి

సంపూర్ణ ద్రవ్యసాహాయ్యమున


గుంటూరు:

ప్రభాకర ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1937




[ వెల 0-12-0

# విజ్ఞప్తి.

—oo‡oo—

ఆర్యులారా! విద్వన్మణులారా! నా విజ్ఞాపన మొం డవధరింపుఁడు. నేను 1915 సం॥ నుండి కవిత్వాభిమానంబున ననేక ప్రదేశంబుల నవధానంబు లాచరించి యవి తాత్కాలికామోదసంఘటితంబులగుటం జేసి కావ్యరచనంబునకుం గడంగితి. 1924 సం॥మున నిర్వచనకుశలవాభ్యుదయమను నొక్క ప్రబంధంబు రచించి విద్యాభిమానుల సాహాయ్యంబున దాని శ్రీహరి కంకితంబొనర్చి యచ్చొత్తించి కృతార్థుండనైతి. 1930 సం॥ మున భక్తకల్పద్రుమశతకమును, 1932 సం॥మున సతీమహిమ యను ప్రబంధంబును, కృష్ణమాయయను నాటకంబును రచించియు నింతవరకు నచ్చొత్తించకుండుటకు ధనహీనమే ప్రధాన కారణము. 1936 సం॥ మున నీయుత్తరహరిశ్చంద్రకావ్యంబును రచించి యిప్పటి కిది యొక మహాపురుషునిసాహాయ్యంబున నచ్చొత్తింపఁ గల్గినందులకుఁ బరమానందసంభరితమనస్కుండ నైతి.

ఈగ్రంథముద్రణమునకుం గారణభూతుండును, మచ్ఛ్రేయోభిలాషియు, విద్యాభిమానియు నగు నమ్మహాత్మునకీ కావ్యం బంకితంబొనరింప సన్నద్ధుండనైతిఁ గాని యయ్యది యట్టి మహాపుణ్యున కయిష్టంబ యైనందున మత్కృతజ్ఞతకుం గారణభూతుండగుచే నట్టిమహానీయునింగూర్చి యొక్కింత ముచ్చటింతు.

సీ॥ ఎవ్వాఁడు నిరతంబు నెసఁగుసద్బ్రాహ్మణ
లక్షణంబులతోఁ జెలంగుచుండు
నెవ్వాఁడు దాఁ జేయనివ్వటిల్లినయత్న
ముల భగీరథుఁబట్టి మూలకనుపు
నెవ్వాఁడు భాషించునెడఁ బక్షపాతంబు
నణఁచి యున్నదియున్నయట్లు పలుకు
నెవ్వానితో సఖ్యమెట్టివారికిఁ గాని
సన్మార్గరూపలక్షణమె కూర్చు

గీ॥ నెవ్వఁడాత్రేయగోత్రుండుహితగుణుండు
నమలయశుఁడు సుబ్రహ్మణ్యునాత్మజుండు
చారుతరరుక్మిణీగర్భసంభవుండు
నతఁడు దండయవిబుధుఁ డేకాస్వయుండు.

సీ॥ అసమానధార్మికుండనుట కేయెడ భవ
ద్ఘటిత మహాధర్మసత్రంబెసాక్షి
మహనీయవిద్యాభిమానుండనుటకునై
కూర్మితోఁ గృతులందుకొనుటె సాక్షి
గురుదైవభక్తియుక్తుండౌటకును వీర
భద్రప్రతిష్ఠయే సుప్రబలసాక్షి
పారమార్థికచింతనారతుండనుటకై
తత్వవిచారణత్వంబె సాక్షి

గీ॥ ప్రాక్తనాచారపరుడంచుఁబలుకుటకును
సంతతైకాదశీవ్రతాసక్తిసాక్షి
యున్నిసాక్షులు తమకుండ నింతవాఁడ
టంచు మిము నెంచఁ దరమె? దండయబుధేంద్ర.

చ॥ ప్రకటయశోవిశాల! ధనవంతులు మేదిని లేరె? యందునూ
టికి నొకఁడైన దాత గలఁడే! సుకృతంబునఁ గాని యిట్టిదా
నికి నిటు లోనుగా డెపుడ; నింద్యమనోహరలోకమాన్యతా
వక గురుదాతృతాగుణమవర్ణ్యము దండయపండితాగ్రణీ.

చ॥ ధనికులచెంతఁ జేరఁ గడుదైన్యముతోఁ దుతఁ జేయిసాచి కో
రిన సమయంబుగాదిదియు రేపౌమఱెప్పుడొ రండుచూతమం
చనివచియింత్రుగానియిటులాడెడుదాతయొకండునున్నె? మీ
యనుపమదాతృతామహిమనౌనని యొంచవశంబె? యేరికిన్.

సీ॥ ధరణిలో సప్తసంతానంబులే మిమ్ము
ఘనపుత్రవంతునిఁగా నొనర్చెఁ
దగుసర్థివాంఛితార్థప్రదానమె మిమ్ము
ననయంబు దానకర్ణునిఁగఁ జేసె
నసమాఃయుష్మదీయప్రధానన్యాయ
వాదమే మిము న్యాయవాదిఁ జేసె

నలభవద్ధర్మసత్రములే మిము మహా
కుతుకంబుతో ధార్మికునిఁగఁ జేసెఁ

గీ॥ గాన మీవంటిధన్యులు గలుగఁ జగతి
నెల్లవారికి లోపమేమేని గలదె
తమగుణంబులు గొనియాడ ధాత కగునె?
యమలసత్కీర్తిసాంద్ర! దండము బుధేంద్ర.

గీ॥ ఒక్కనాఁ డేదియో కార్యముండి నేను
మీసరసఁ జేరి మాటలమీదఁ బూర్వ
చరితమైనయుత్తరహరిశ్చంద్రగాథ
వ్రాసితినిగావ్యముగ నంచుఁ బలుక నపుడు.

శా॥ సచ్చారిత్రికమైనయుత్తరహరిశ్చంద్రాఖ్యకావ్యంబు నే
నచ్చొత్తించెదనంచు నాటిరి వదాన్యత్వంబునన్ వేడుగా
నెచ్చోనున్నదె? యిద్దిగాకతమబోంట్లెల్లుంటమాలోట్లనన్
వచ్చుంగాదె? యశంబులోకములలో వ్యాపించి విద్వన్మణీ.

చ॥ అడిగినవారి కెంతయిన నావల కేగుమటంచు నాడకే
వడి నిడునట్టిదాత జనవందితుఁ డుచితచారుకీర్తినం
తుఁడుగుణవంతుఁ డుత్తమబుధుండు కృపాత్ముఁడమానసత్పథ
క్తుఁడుఁగడుధార్మికుండఘవిదూరుఁడుదాడయుశంతిత్రుంజిలన్.

సీ॥ బీదసాదులనెల్లఁ బిలిచి కార్యముపట్ల
మృష్టాన్నభోజనం బిడు నెవండు

తగవులం గని తీర్చుతఱి నెవ్వ రేమన్న
నున్నదున్నట్లాడుచుండు నెవఁడు
ధర్మకార్యములందు ద్రవ్యంబునీయఁదా
వేడ్కతో ముందంజవేయు నెవఁడు
దైవమెవ్వారికి ధనమొసంగుట పేద
లను భరించుట కంచునను నెవండు

గీ॥ నాతఁ డౌదార్యవంతుండు న్యాయవాది
లోకమాన్యుండు ధనికుండు లౌకికుండు
మేరుధీరుండు వార్ధిగంభీరుఁ డఖిల
నయకళాకోవిదుండు దండయబుధుండు.

గీ॥ ధర్మకార్యైకతత్పరత్వమునఁ జెలఁగు
మిమ్ములను మఱి మీకుటుంబమ్ము నెపుడు
నాయురారోగ్యభోగభాగ్యములఁ గూర్చి
ప్రోవఁ గూరిమి రామచంద్రునిఁ దలంతు.

వ॥ ఇట్టిమహాపురుషుని సాహాయ్యంబున నిదినాయిష్టదైవంబగు శ్రీరామచంద్రునకంకితంబిడి వెల్లడింపఁగల్గితిని. ఇట్టి నాకావ్యంబున నెచ్చటనైన లోపంబులున్న మన్నించి విద్వాంసులు తెలియంబఱచిన ద్వితీయముద్రణమున వానిని సవరించుకొనియెదనని ప్రార్థించెద.

మ॥ తలయూపన్ సమకట్టునొక్కఁ మొగివిద్వచ్ఛ్రేణినీయందుఁ జె
ల్వాలరారం గలయీగుణధ్వనిరసాలంకారతాత్పర్యని
ష్ఠలఁ గానన్ వెలయించెదండయసుధీచంద్రుండునిన్నిట్లు; ని
చ్చలునీభాగ్యమెభాగ్యముత్తరహరిశ్చంద్రాఖ్యసత్కావ్యమా.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
రత్నాకరం అనంతాచార్యులు,
శతావధాని.

---

# కథాసంగ్రహము.

తొల్లి జ్యోతిష్మంతుండను రాజేంద్రుండు ధర్మంబు చతుష్పాదంబులం బ్రవర్తిల్ల రాజ్యంబొనరించుచుఁ దనకోర్కుల నెరవేర్పు పుత్రుఁడు లేని కారణంబునఁ బరాత్పరుండగు శ్రీమన్నారాయణుని మనఃకమలంబున నిలిపి తపమాచరించి తుదకు నాతనికటాక్షంబున నొక్క కుమారింగని సంతోషాంబుధి నోలలాడుచుండె.

ఆయింతి పుట్టినలగ్నంబు చెడ్డదియైనను పదియాఱవయేట నతికఠినంబై జననీజనకులకు నాశనహేతువగుదుర్ముహూర్తంబున సమర్తాడెను. అంతట నారాజు కార్తాంతికులచేఁ దద్విషయంబంతయు నెఱింగి యర్ధరాత్రంబున నిద్రించు నా కాంతామణి నొక్క మందసంబున భద్రంబుగానుంచి తాళంబు వైచి నగరప్రాంతంబునం బ్రవహించు నొక్క మహాతరంగిణిం బడవైపించె. పిమ్మట నామందసంబు జలంబులమీఁదఁ దేలియాడుచుఁ బోవంబోవఁ దుదకుఁ గొంతతడవునకు మేల్కాంచి లేచుటకుంగాని కూర్చొనుటకుంగాని వీలులేక తల్లిదండ్రుల మాట లదివరకు వినియున్నందున వారే జ్యోతిష్కులమాట లాలించి నన్నిట్లుచేసిరని బిట్టువాపోవుచుండె.

అట్లామందసం బాప్రవాహంబునంబడి పెక్కుదేశంబు లతిక్రమించి పోవఁ దన్నదీప్రాంతంబునంగల యొక్కపుణ్యాశ్రమంబునఁ దపంబొనర్చుచున్న మయుండను మునీంద్రుం

డాయార్తనాదంబాలించి యటకేగి శిష్యులంబంపి నీళ్ళుబడి కొట్టుకొనిపోవు నామందసంబుఁ జేరువకుం దెప్పించి తాళంబుఁ దీయింప నందున్న యక్కాంతామణి వానికిం బ్రణామంబు లాచరించి దుఃఖించుచు నిలువంబడియె.

అంత నమ్మునీంద్రుం డామె నాశీర్వదించి జరిగినవృత్తాంతంబంతయు నామెవలన నాలించి "అమ్మా!" నాయాశీర్వచనములవలన నీకెట్టియిక్కట్టులు రానేరవు. నీపుట్టినపుడె కలిగినట్టి కీడులకెల్ల ముఖ్యచిహ్నంబుగా నీగళంబునందు విరాజిల్లు మాంగల్యంబు నీప్రియునకుంగాని మఱెవ్వరికిం గానరాకుండునని వరంబొసంగి యట నామెకుందగిన వసతులేర్పఱచి యింక నీవొక్క రాజచంద్రుం బెండ్లాడి సంపదలం దులదూఁగుమఁ జంద్రమతియను పేరుతో వర్తింపుమనినుడివి ప్రీతిం బెంచుకొనుచుండె.

ఇట్లుండ నొకానొకసమయంబున హరిశ్చంద్రసార్వభౌముండు వేటకరుదెంచి యుద్యానవనంబున విహరించు నాచంద్రమతింజూచి యామెచెలులవలనఁ దద్వృత్తాంతం బారసి యమ్మునీంద్రుని కటాక్షంబున నామెం బెండ్లియాడి రాజ్యసుఖంబులనుభవించుచుండె.

ఈ హరిశ్చంద్రుడు తొల్లి యవంతీదేశమును పాలించు నీలలోహితుండను రాజేంద్రుండు. ఈతనిగానంబునకుం బాత్రుండై యట జనభద్రుండను నొక్క పాలికుండుగలండు ఆతనికిఁ జిరకాలంబున నొక్క పుత్రుండుదయించెను. ఆపుత్రునకు యౌవనంబు ప్రాప్తింప నొక్క కాపుబాలికను దెచ్చి వివా

హంబుఁ గావించె. అబ్బాలామణి కలకంధరయను నామంబుచేఁ బ్రసిద్ధిఁగాంచి తన యీడు కాపుబాలికలతో రాట్నాలసాలం జేరి యేకులువడకుచుఁ గాలంబుపుచ్చుచుండె. అంతట నొక్క నాఁడా నీలలోహితుండు హయంబునెక్కి విహారార్థమై బయలు వెడలి రాజమార్గంబున వచ్చుచుండఁ గలకంధర తాఁజేయు కార్యంబువిడిచి తనతోడిపడుచులంగూడి తలవాకిటికివచ్చి యారాజుంజూచె. ఆతండాబాలికనుంజూచె. ఆచూపులవలన నిర్వురును పరస్పరమైత్రిజనించి ప్రీతిమనస్కులైరి. అంతట నారాజు జనభద్రుని బాదికాణనిడి వానివారలనందరిని మాల వాండ్రకు వరపుళ్ళుగా సమ్మించి వాని సర్వస్వముఁ గొల్లగొని కలకంధరను తనమందిరంబుచు జేర్చికొనియె. పిమ్మట నాజన భద్రుం డాయిడుమల సహింపలేక యురివేసికొని మరణింప వానిబంధుజాలంబంతయు నగ్నిప్రవేశంబుఁజేసె. ఇట్లు కలకంధర యాభూవల్లభుం జేపట్టి యత్తవారియిల్లు నాశనంబుఁజేసి యథోచితవిహారంబులఁ గాలంబు గడుపుచుండె.

ఇట్లు కొన్నిదినములకు నాపురంబుననుండు నారీమణు లందరుఁ గేదారేశ్వరవ్రతం బాచరించుచుండఁ దద్విధానంబంతయు బురోహితునివలన నెఱింగి తానుంగూడ నావ్రతంబు యథా విధి నాచరించి యుత్తరజన్మంబున రాజపుత్రియైపుట్టి నిత్య సత్యవ్రతుండనగు నొక్కచక్రవర్తికి రాణియయ్యె. ఈకలకం ధరయు జ్యోతిష్మంతునికిఁ గుమారియై పుట్టె. తొల్లిటి జన్మంబున శ్వశురవంశమును పాడొనరించినట్టి యీ కలకంధర యుత్తరజన్మంబునఁ బితృవంశ వినాశినియయ్యె. కావున నీ కల

కంధర కేదారేశ్వరవ్రతం బాచరించి తోరంబుఁగట్టుకొనునపు డెన్నిజన్మముల కేని యీతఁడేపతిగానలెనని కోరుకొనియె. అందు వలన హరిశ్చంద్రుఁడై పుట్టిన నీలలోహితునిఁ జెట్టబట్టె. నీల లోహితుండు దానిమామను, వానిబాంధవులను, మాలలకు దాసులుగా నమ్మించుటంజేసి తాను హరిశ్చంద్రుఁడై పుట్టి సత్య వ్రతవ్యాజంబున మాలవానికి దాసుండయ్యె. ఉత్తరజన్మంబునఁ గలకంధరా నీలలోహితులే చంద్రమతీహరిశ్చంద్రులై పుట్టిరి.

అత్తఱి నీలలోహితుండు విశ్వామిత్రునిపంపున సర్వ జిత్తను రక్కసునిందునుమాడి యందుకుఁ బ్రతిఫలంబుగాఁ దా హరిశ్చంద్రుఁడై పుట్టి సత్యవ్రతవ్యాజంబునఁ బూర్వజన్మంబున దాఁ గోరినవిశ్వామిత్రునితపఃఫలంబున నర్ధభాగంబును గైకొనియె.

నలకూబరుండు లోహితుండై పుట్టి

తక్షకదష్టుండగుటకుఁ గారణము.

మఱియుఁ దక్షకుండు సురేంద్రదర్శనోత్సుకుఁడై దినం బునకరుగుచుండఁదనకుమారుఁడును వెంటవచ్చుచు నలకాపురం బుచెంతనిలిచి తన్నగరవైభవములం జూచుచుండె. అప్పుడు గం ధాగృహంబున కరుగు నలకూబరునకు సడ్డంబుగానుండుటచే దానింగాంచి యాతండు సర్పంబు త్రోవనిలుచుట హానికి మూలంబని ఖడ్గంబున నఱికి చేనియె. ఆవృత్తాంతంబు తక్షకుండు నారదునివలన నాకర్ణించి కోపాటోపంబున నలకాపురికరిగి చచ్చిపడియున్న కొడుకుంగాంచి శోకించి పాపమస కిల్బిషప

బాలకు కరవాలుపాలుజేసి చనినపాలసుండు మర్త్యలోకంబున మానవుండై పుట్టి నేఁగఱువఁ జచ్చుఁగాకయని శపించి శచీంద్రుని వలనఁ దాఁబడసిన మృతసంజీవనమణిప్రభావంబునఁ బుత్త్రిం బ్రదికించికొని చనియె. అంతట నాసమాచారంబు కౌబేరివిని తనప్రియసతియగు రంభకుసఖియగు మేనకకుం బ్రియుండగు కౌశికుండు తన్నుంగావంగలఁడని వానిచెంతకేగి తక్షకశాపం బును వినిపింప నందులకు నలకూబరుం గరుణించి వానిశాపంబు నిన్నేమియుంజేయఁజాలదు. నీయంశంబున నొక్క మానవుండు హరిశ్చంద్రునకుం బుత్త్రుండై పుట్టి తక్షకదష్టుండై మడిసి తల్లి దండ్రులపుణ్యంబునఁ బునర్జీవితుండై పెక్కేండ్లు రాజ్యపాలనం బాచరించుంగావున నీవుచింతిల్లక పొమ్మని యనుగ్రహించె. దానంజేసి లోహితాస్యుండు నలకూబరాంశంబున భూతలంబున జన్మించి తక్షకదష్టుండై మడిసి పునర్జీవితుండయ్యె.

## యముండు వీరబాహుండై పుట్టుట

త్రొల్లి హరిశ్చంద్రుని తండ్రియగు త్రిశంకుండు హరిశ్చంద్రునిం బట్టభద్రుం జేసి యీశరీరంబున నింద్రలోకంబుఁ జేరు తలంపున నిన్నాశ్రయింప వచ్చితినని వసిష్ఠుం జేరి ప్రార్థించె. అందులకా మునివరేణ్యుండు నీయీప్సితంబు పొసఁగనేరదని వాక్రువ్వ నాతనిందూలనాడె. అందులకాతండలిగి నీవుచండాలుండవు కమ్మని శపించె. అంతటఁ ద్రిశంకుండు విశ్వామిత్రు

నాశ్రయించి తనకోరికం దెలిపె. అంతులకాతం డంగీకరించి మంత్రోపదేశంబుం జేసి స్వర్గంబునకేగుమనం ద్రిశంకుండట్లొనరించె. అప్పు డింద్రదర్శనార్థమై వచ్చినయముండు వానింజూచి యీమాలం డెవ్వండో భయంబులేక స్వర్గద్వారంబుం బ్రవేశింపం బోవుచుండెనని వానిని భటులచేం దలక్రిందుగ నిలకుంద్రోయించె.

అంతటం ద్రిశంకుండా గాధేయునిం బ్రార్థింపం గౌశికుండు కినిసి రాజేంద్రా! నీవున్నస్థలంబే స్వర్గంబుకాని వేఱొండుగలదెయని నిజతపస్సామర్థ్యమున స్వర్గవాసులనాకర్షింప యత్నించుటవలన బ్రహ్మాండమంతయు వణంకందొడంగె. బ్రహ్మ యచ్చటికివచ్చి యంతవరకు నాకృష్టులగు విబుధగణముతోం గతిపయగ్రహతార లమ్మహీవరుంబరివేష్టించి నిల్వ నీవుండున్న చోటు త్రిశంకుస్వర్గమను ప్రసిద్ధిం గాంచునని యనుగ్రహించి యతనికోపంబుడిపిచనియె. అంతటినుండి యారాజు గగనంబునం దలక్రిందుగ నేలుచుండె. అందువలన విశ్వామిత్రుండు కోపమూని దండధరునిం జండాలునింటంబుట్టుమని శపించి యతండు శాపమోక్షణముం బ్రార్థింప నాకుహితంబొనర్చి యీశాపంబు నుండి విముక్తుండవగుమని విశ్వామిత్రుం డనుగ్రహించె. అది కారణంబున యముండు భూలోకంబునం గడజాతివాండగు వీరసేనునకుం గుమారుండై వీరబాహునామంబున జన్మించి హరిశ్చంద్రుని దాసునిగా గ్రహించి కౌశికునకు హితమాచరించి యాశాపమునుండి వీడుకొనియె.

# శని కాలకౌశికుండగుట

తొల్లి త్వష్టృపుత్త్రియగు సంజ్ఞను సూర్యుండు వివాహమై మనుదండధరులను నిర్వురుకుమారులంబడసె. ఒకానొకనాఁడు సంజ్ఞ పుట్టినింటికింబోవ యత్నించి తనఛాయ నొక్కతెనుంజేసి ఛాయయను పేరువెట్టి చెల్వనిం గుమారులను గాన నాజ్ఞాపించి చెప్పకయపోయె. ఇటుఁజాయకమలాప్తునకన్యయూటను బోధపడనీక మెలఁగుచు వానివలన సావర్ణశనైశ్చరులను కుమారులంగాంచి మనుదండధరులను చూడకుండె. అంతులకు యముండు కినిసి శనైశ్చరుఁ గాలువిఱుగఁదన్నె. ఈవిషయంబు సూర్యుండెఱింగి సంజ్ఞపోకతెలిసి తురంగియై భూతలమునఁ గురుక్షేత్రవనంబునం దిరుగు దానియందు నశ్వినులంగాంచి యంతవలన నిజరూపంబుదిన సతిందోడికొనిచనియె.

ఆయశ్వినులు దేవవైద్యులై కీర్తింగాంచిరి. అంత సంజ్ఞాదేవి తనకుమారుల కపకారమొనరించిన ఛాయయందలి కోపంబున శనైశ్చరుని భూమిపై పడంద్రోయ నాతండు నైమిశారణ్యపుణ్యక్షేత్రంబునంబడి యంతకుండు విఱుగనడిచినట్టి పాదమూడఁగఁ బంగువై యందలి తపమాచరించు కౌశికమునింజేరి యాతనివలన మంత్రరహస్యంబులెఱింగి చిరకాలంబు తపంబాచరించి గ్రహపదమొందె. కావున శనైశ్చరుండు కాలకౌశికుండై పుట్టి కౌశికునకుం బ్రియంబాచరించె.

## 8

పిమ్మట సత్యవ్రతరక్షణంబునకై పడరానియిడుమలంది భార్యాపుత్రసహితుండై హరిశ్చంద్రుండు రాజ్యంబొనర్చి తుదకు నింద్రలోకంబున నింద్రునర్ధాసనంబధిష్ఠించె. ఆతఁ డిప్పటికి నచ్చట సుఖాంబుధి నోలలాడుచుండె.



శ్రీరస్తు.

శ్రీరామాయ నమః

శ్రీ సరస్వత్యై నమః

# ఉత్తర

# హరిశ్చంద్రకావ్యము.

## ప్రథమాశ్వాసము.

శ్రీ వైదేహి నిజాంకపీఠిఁ బరిభాసింపన్ మహాభక్తితో
సేవింపం దగురీతి సోదరులు తుష్టిం బద్మభూశ్రీమహా
దేవేంద్రాదులుగొల్వ భూరికరుణాధీనాత్ముఁడై లోకముల్
ప్రోవంగల్గినరాముఁడే యొసఁగు శుభంబుల్ గూర్చిమమ్మోముతన్.

చ॥ పొలుపు వహించి పాల్కడలిఁ బుట్టి జగజ్జనయిత్రియై జనం
బులకు దరిద్రముల్ గెడపు ప్రోడయునై కటివేల్పునింతియై
కలుముల రాణియై యశముఁగాంచి జగంబుల వన్నెకెక్కి రా
జిలునలతల్లితల్లిఁ గృపఁజే సిరులీయఁ దలంతు నెమ్మదిన్.

ఉ॥ లీలలతో జగంబు లవలీల సృజించుచుఁ దా మనోజ్ఞవా
ణీలలనాముఖంబు విధునిం బలె నెంచి నిజాసనాంబుజం

బోలిముడుంగునో యనుచు నూనిముఖంబులలోన భారతిం
దాలిచినట్టిధాత నిరతంబుఁ జిరాయు వొసంగి ప్రోచుతన్.

సీ॥ అసమానరుచిరలీలాంభోరుహాళినీ
రుతులాత్మవల్లకీశ్రుతులుగాఁగఁ
బ్రియకీరశారికా పికరాజహంసాది
సంచయం బలసభా జనముగాఁగ
సకలవేదాంతార్థ సారోద్యదుపనిష
జ్జాలంబు హితసఖీజనముగాఁగ
నబ్జాసనంబు లీ లాగారవిమలనూ
త్నస్ఫాటికమయాసనంబు గాఁగ
గీ॥ నమలమణికంకణంబులు హస్తపల్ల
వముల ఘలుఘల్లుఘల్లుఘల్లుమనిమ్రోయ
నింపుమీఱంగ వీణ వాయించునట్టి
పలుకులవెలంది నాయాత్మ వెలయుగాత.

శా॥ గంగాదేవిని నుత్తమాంగమున వేడ్కన్ దాల్చి శర్వాణి న
ర్ధాంగం బందున నిల్పి తా సవతికయ్యంబూడ్చి కారుణ్యదృ
ష్టిం గామంబులు గూర్చి దక్షిణునిమాడ్కిం జెల్వుఁజూ
పించునా, గంగానాథుఁడు మాకుఁగూర్చునెపుడుం గా
మ్యంబులైశ్వర్యముల్.

చ॥ అనవరతం బజాండముల నాడెడుబంతులుగా నొనర్చుభా
మిని ధవునర్ధకాయమున మించి వెలుంగుపడంతి లోకపా
వని రుచిరాబ్జపాణి హిమవంతుని ముద్దులపట్టి కూర్మితో
ఘనతరమంగళంబుల సుఖంబుల మాకొనగూర్చుఁ గావుతన్.

సీ॥ ఎవ్వాఁడు దా జనియించినప్పుడె ఫల
భ్రాంతిచే నేగి మార్తాండు మ్రింగె
నెవ్వాఁడు శౌర్యంబు నివ్వటిల్ల మహోగ్ర
రంగ త్తరంగ వారాశి దాఁటె
నెవ్వాఁడు రమణీయ హేమసౌధశ్రేణి
రాజితలంకాపురంబుఁ గాల్చె
నెవ్వాఁడు రామభూమీశాంగుళీయకం
బిడి మైథిలీశోక ముడిపి వచ్చె
గీ॥ నెవ్వఁడు రణాంగణంబులో నేపుఁజూపు
ఘోరగీర్వాణశాత్రవ కులముఁదునిమె
నట్టిశ్రీమంతు ధీమంతు నఖిలరిపుకృ
తాంతు గుణనంతు హనుమంతు నభినుతింతు.

ఉ॥ అంబుధిశాయికిన్ శయనమై వసుధాతలమున్ సహస్రశీ
ర్షంబులతో వహించుచు నిరంతరమున్ హరిదాస్యకామియై
తుంబురనారదాదు లతితోషమున న్వినుతింప సర్వకా
మంబుల భక్తకోటి కిడి మన్చుననంతుని సన్నుతించెదన్.

మ॥ సరసీజాక్షు సువర్ణవేత్రధరు విష్వక్సేనుఁ గందర్పసుం
దరునిన్ సూత్రవతీజయాధిపు బుధోత్తంసున్ గృపాత్మున్ న
భయు, కరదుష్ప్రాపలతాలవిత్రు సురసంఘాతస్తుతాంఘ్రి
ద్వయున్, నిరతంబున్ దలఁతున్ మదీయకృతి మన్నింపఁగ
నిర్విఘ్నతన్.

సీ॥ మహిత కశ్యపతపోమహిమచే వినతాంగ
నారత్నగర్భంబున నుదయించి

వారాశిలోపల వర్తించి మనుజుల
నేచునిషాదుల నెల్లఁ దునిమి
తండ్రిపంపున నేగి ధైర్యంబుతో విక్ర
మముఁ జూపుగజకచ్ఛపములఁ బ్రమింగి
సురకిన్నరాదులు పరికించి వినుతింప
నబ్జాక్షువాహనమై చెలంగి

గీ॥ విబుధనాథాది దివిజప్రవితతి గెల్చి
కామముల నయ్యుపేంద్రుని కరుణఁబడసి
యమృతకలశంబుఁ దెచ్చె నే యఘువిదూరుఁ
డట్టిఖగనాయకుని మదీయాత్మ దలఁతు.

సీ॥ ఎవ్వాఁడు నిజపూజ కిందిరానాథుచేఁ
బ్రీతితో మొదటఁ గల్పింపఁబడియె
నెవ్వాఁడు జ్ఞానియై భృగుమరీచ్యాదుల
కఖిలవేదార్థంబు లానతిచ్చె
నెవ్వాఁడు శ్రీనాథు నెపుడుఁ బూజించుచుఁ
బూజ్యదివ్యాగమంబును రచించె
నెవ్వాఁడు నిఖిలమహానీశ్వరశ్రేణిలో
రమణీయనాయకరత్నమయ్యె

గీ॥ నట్టిలోకైకపావను నఘువిదూరు
దండయజ్ఞోపవీతకమండలధరు
వివిధమునిపూజితపదాబ్జు విమలకీర్తి
వంతు విఖనోమునీంద్రు భావింతు నెపుడు.

సీ॥ ఎవ్వాఁడు మొదటఁ దా నిలఁ గీరితిం గాంచి
వాగ్దేవి తానయై వన్నె కెక్కె
నెవ్వాని జూచి మోహించి వాగ్దేవి త
ల్లలితనానాబంధములకుఁ జిక్కె
నెవ్వాఁడు పాండితి నివ్వటిల్ల నలంకృ
తులలక్ష్యలక్షణంబుల రచించె
నెవ్వాఁడు రసికాళి కింపారఁ జిత్తంబు
లమితలీలావినోదములఁ గూర్చె

గీ॥ నెవ్వఁడు సమస్తభావావాహాలిముముననట్లు
బుధవరేణ్యవినుతకావ్యముల రచించె
నట్టిజగదుపకారాత్ములై చెలంగు
కవివితానాగ్రగణ్యాంధ్రకవులఁ దలఁతు.

సీ॥ ఏధీరు లుంట ధాత్రీశాదిసభలలోఁ
గవులకెల్లరకు విఖ్యాతి గల్గె
నేసుధీవరులుంట నెల్లపామరులకు
నసమానసరసకావ్యములు గల్గె
నేవిచక్షణులుంట నిల భోగవంతుల
కమితలీలావినోదములు గల్గె
నేకవీశ్వరులుంట నెల్లవారల కిట్లు
రమణీయనిఖిలశాస్త్రములు గల్గె

గీ॥ నేమహాత్ములు విద్వాంసులివ్విధమున
లలితగ్రంథాబుల రచించి రెలమిమీాఱ

నట్టిజగదుపకారాత్ములై చెలంగు
సకలగీర్వాణకవుల కంజలియొనర్తు.

సీ॥ ఎవ్వారు విమలసర్వేంద్రియంబులఁ బాసి
వ్రణగామిమశకాళివలెనటింతు
రెవ్వారు లేనిపోయినవిమర్శనములఁ
గల్పించి యొరులఁ జీకాకుసేతు
రెవ్వారు దామె వాగీశతుల్యులమంచుఁ
బరులు వ్రాసినవాని భంగపఱుతు
రెవ్వారు దామె మమ్మితరులిట్లు నుతించి
రని పద్దెముల వ్రాసికొని వచింతు

గీ॥ రెవ్వరు సమస్తభావాదులీసడించి
విజ్ఞులమటంచుఁ దప్పుల వెదకుచుందు
రట్టిదుర్గుణవంతుల నధికపాప
జనులఁగుకవితతుల నెప్పుడు నిరసింతు.

సీ॥ ఆదిలోఁ బంచకావ్యములం బఠింపఁ జే
సినశివస్వామిశాస్త్రిని నుతించి
తేటగా మీఁదట నాటకంబులఁ జెప్పి
వెలయుసుబ్రహ్మణ్యవిబుధునెంచి
యటుమీఁదఁ బాణినీయము నేర్పినట్టి గా
జులపల్లిహనుమయసూరిఁ దలఁచి
ప్రకరణజ్ఞానంబుఁ బరపి న్యాయంబున
వెలయువెంకటకృష్ణవిబుధుఁ గొలిచి

గీ॥ చిన్నినాఁ డైతకన్నె కువన్నెలిడిన
గురులఁదిరుపతి వెంకటేశ్వరులఁ దలఁచి
బహుళరసవృత్త్యలంకారభావవిధులు
నివ్వటిలదీని వ్రాయఁ బూనితిఁగడంగి.

## కవివంశాభివర్ణనము.

సీ॥ అసమానవేదవేదాంగాది విద్యావి
రాజితుల్ రత్నాకరంబువారు
తరణిపుత్రునిలీల దానక్రియాది వి
భ్రాజితుల్ రత్నాకరంబువారు
సకలదిక్సంతానసంపూర్ణకీర్తివి
భ్రాజితుల్ రత్నాకరంబువారు
సరసిజాక్షునిరీతిఁ బరమకారుణ్యవి
భ్రాజితుల్ రత్నాకరంబువారు

గీ॥ ప్రకటధార్మికచారిత్రపాళికమల
రత్నతుల్యులు రత్నాకరంబువారు
లలితకీర్తిసుధాంశువిలసితనిఖిల
రాజమాన్యులు రత్నాకరంబువారు.

క॥ ఆరత్నాకరసత్కుల
పారావారహిమకరుఁడుఁ బరమయశుఁడున్
ధీరుఁడు శేషార్యుం డిలఁ
బేరుం గాంచెఁ దమి మీఱఁబెద్దలకెపుడున్.

క॥ ఆయనకార్గురు పుత్త్రిలు
ధీయుతులు జనించిరతుల తేజోవంతుల్
శ్రీయుతులు నిఖిల సుగుణా
గ్రీయులు దిక్పూర్ణవిమలకీర్తివిలసితుల్.

క॥ ఆయార్గురిలోఁ బ్రథముం
డేయెడ నఖిలప్రియుండు హితమానసుఁడున్
శ్రీయుతుఁడు రంగార్యుం
డాయతవిఖ్యాతి నలరె హరిభక్తుండై.

సీ॥ మావంశమున నొక్కమాన్యుండు నొక్కభూ
ధవునింటఁ జేరి వైద్యంబులోన
నసమానపటిమ నింపెసలారఁ జూపించి
పదిమందివైద్యులు కుదురదనుచు
వదలినరోగంబు పదిదినంబులలోఁ గు
దిర్చిన నారాజతిలకుఁ డపుడు
నెనలేని సంతోషమును జెంది యావైద్య
తిలకునిం బిలిపించి వలసినట్టి

గీ॥ ద్రవ్య మర్పించి తగినక్షేత్రంబు లొసఁగి
వైద్యరత్నాకరుండవై వఱలుమనుచు
బిరుద మీయ నప్పటినుండి వెలసె మాకు
నెసఁగు రత్నాకరమటంచు నింటిపేరు.

సీ॥ ఎవ్వాఁడు నిరతంబు నిందిరారమణుకై౦
కర్యం బొనర్చుచు ఘనతఁ గాంచు

నెవ్వాఁడు పదిమంది కెలమిఁగూర్చుచు సదా
తలలోన నాలుకవలె నటించు
నెవ్వాఁడు దుర్మార్గు లేమిచేసినఁ గాని
పరమశాంతస్వభావంబు నొందు
నెవ్వాఁడు రిపులు మాయింటికీయెడ రండ
టన్న భేదము సేయకరుగుచుండు

గీ॥ నట్టిలోకైకపూజ్యుండు నమలచరితుఁ
డధికకీర్తివిశాలుఁడార్యప్రియుండు
వైద్యశాస్త్రప్రవీణుండుఁ బరమసుగుణ
యుతుఁడు మాతండ్రి రంగార్యుఁ డొప్పుచుండె.

సీ॥ ఏయింతి యిందిరాధీశుపూజయె మోక్ష
దాయకంబనుచు డెందమునఁ దలఁచు
నేసతీమణి మనోల్లాసంబు మీఱఁ దాఁ
దులసీమహార్చనాదుల ఘటించు
నేరామ ప్రాక్తనాచారంబులనొసర్చు
టయె బ్రాహ్మ్యమని విస్ఫుటముగఁ బలుకు
నేసాధ్వి పనిఁబూని యేకాదశీవ్రతం
బనిశంబు దీక్షతో నాచరించు

గీ॥ నట్టిమాయమ్మ సుగుణమాన్య మహనీయ
రామనామపవిత్రహృత్సీమ రాజ
మాంగనామణి నాహృదయాంబుజమునఁ
దలఁతు నీయెడ మిగులమోదంబుతోడ.

క॥ ఆరంగార్యుం డిలఁ జె
ల్వారఁగ నీసాధ్వి రాజ మాంబయనెడు కాం
తారత్నముఁ గై కొని సదు
దారగుణవినుతుల ముగురుతనయులఁ గాంచెన్.

గీ. ప్రథముఁడను నేననుష్ఠాన పరుఁడతండు
సత్యనారాయణార్యుండు సద్యశుండు
రెండవకుమారుఁ డతి ధీవరుండు శేష
యార్యుఁడుఁదృతీయపుత్త్రుఁడౌదార్యయుతుఁడు.

క॥ దేశములఁ దిరిగి బహు వి
ద్యాశేఖరులన్ భజించి యతిశయభక్తిన్
బేశలవిద్యల తత్సం
కాశమునన్ నేర్చినాఁడ గవులనుతింపన్.

మ॥ సరసంబై తగురీతి నుత్తరహరిశ్చంద్రాఖ్యకావ్యంబు నీ
సరణిన్ వృత్తులలంకృతుల్గుణము లేచాయన్ విమర్శించినన్
వఱలన్ రామునకంకితంబు నిడి సల్పం బూనితిం గాన నీ
వరులం దద్గుణముల్ గ్రహించుటకుసంప్రార్థింతు నేనీయెడన్.

గీ॥ శ్రీరమాపతిభక్తులు చారుగుణులు
రాజమాంబాంబుజాక్షి నారాయణాఖ్య
తెలమిఁ బెంచినమాతామహులగుట మది
వారినిర్వుర వినుతింతు భక్తిమీఱ.

షష్ఠ్యంతములు.

క॥ శ్రీమునకు నిఖిలమంగళ
వాదునకుం ద్రిభువనాభివంద్యున శభయా

పావనను నిత్యజయసం
పావనకుఁ నిఖిలభక్తమందారునకుఁ.

క॥ శాంతునకు సమ స్తసమ
స్వాంతునకుఁ యోగిహృన్నిశాంతునకు దయా
స్వాంతుకుఁ బూజ్యసుగుణాని
శాంతునకుఁ జ్ఞాతవేదజాలాంతునకుఁ.

క॥ పుణ్యునకు నిఖిలలోకశ
రణ్యునకుం గుంభిపతిశరణ్యునకు మునీ
డ్గణ్యునకు దళితఘోరహి
రణ్యునకుఁ నిఖిలనిర్జరవరేణ్యునకుఁ.

క॥ భద్రునకు దళితగర్వస
ముద్రునకుఁ మోక్షునకు మునివినుతునకుఁ
క్షుద్రాసురాపహారణున
కద్రిసుతేశాదినిర్జరాళినుతునకుఁ.

క॥ ధాత్రీరమణేంద్రునకుఁ
శాత్రవహారణునకు నిఖిలజనపూజితచా
రిత్రునకు నిఖిలలోక ప
విత్రునకుఁ బరమభ క్తవితతినుతునకుఁ.

క॥ గుణికిఁ వినిహాతభీకర
ఫణికిఁ సౌందర్యమణికిఁ బద్మానత్కో
మణికిఁ గీర్వాణశిఖా
మణికిఁ యోగీంద్రరాజిమానసమణికిఁ.

క॥ పాపాళిహరణునకు సీ
తాపతికిన్ నిహతనిఖిలదైత్యావళికిన్
భూపాలశిఖామణికిన్
శ్రీపరిపూర్ణునకు శాంతశీలాత్మునకున్.

క॥ లీలాగారాతిరుచిర
నీలసమాంగునకు నిఖిలనేతకు హరికిన్
కాళీనుతునకు హాటక
చేలునకున్ సుగుణమణికి శ్రీరామునకున్.

వ॥ సమర్పణంబుగా నాయొనర్పంబూనిన యుత్తరహరిశ్చంద్ర
కావ్యంబునకుఁ గథావిధానం బెట్టిదనిన.

సాకేతపురవర్ణనము

గీ॥ అఖిలసంపదలకు గేహమై రహించు
నవనిదేవికి నాభరణాయమాన
మై విరాజిల్లుఁగోసలమనెడుదేశ
మీభరతఖండమున వాసికెక్కిమిగుల.

గీ॥ అందుసంపాదితసుకృతబృంద యగుచు
వఱలుసరయూనదీపరిసరమునందు
నఖిలసిద్ధజనారాధ్యమై యయోధ్య
యనెడు పురవర మొక్కండు దనరుచుండె.

సీ॥ గగనభాగంబున గర్జించుమేఘపం
క్తులఁగదల్చుకడానిగోపురములు
లలితంపుభానుమండలముతో సఖ్యంబుఁ
గోరుపచ్చలగాలిగోపురములు

చిశలఁ గాంతుల నింపి తేజరిల్లుమనోజ్ఞ
మణిగణప్రతిబద్ధమంటపంబు
లుడుమండలంబుతోఁ గడుఁ జెల్మిఁ గాంచునా
తనచంద్రకాంతబద్ధవరణములు

గీ॥ దివ్యమాణిక్యముల గెల్చుదీపికలును
సదమలసుధాంశుమండలసఖ్యమొంచు
రత్నసందితచామీకరధ్వజములు
గలిగి సాకేతపురవరం బలరుచుండె.

మ॥ అలసాకేతపురాధినాయకసముద్యద్రంగయాత్రాసము
త్కలికారింఖసుదగ్రవిగ్రహసటత్కంఖాణరేఖాఖురా
వళిఘాతోత్థితభూపరాగము మహావారాశినింజొచ్చి ని
స్తులతన్నిలిమకున్ నిరంతరము హేతుత్వంబునన్ రాజిలెన్.

మ॥ రమణీయాతిసుగంధగంధిలతదారామంబులందు న్విహా
రములం జేయుచుఁ గుంజమందిరముల న్రాగంబులం బొందు
చున్, సుమనోభామినులెల్ల నాపురసతీస్తోమంబులం గూడి
శ్రీస్తిమితిందత్సఖులోయనందగిరటన్ దివ్యాంశుజాలంబులన్.

చ॥ కులుకుమిటారిచన్గవలుఁ గ్రొమ్ముడులుం బిగికౌనులుంబిరుం
దులు గదలం బులుంగులనుదోలునెపంబున గొంతులెత్తి గా
జులు గలుగల్లన న్వలపుఁ జూపులతోఁ దమకంబుఁ గొల్పఁ
గాఁ, గలుగుచు రచ్చటం బొలముఁ గాపరికాపుతుటారి
కత్తియల్.

ఉ॥ చత్వరకాంతిసంపదల సన్నుతి కెక్కి పయోదనీలకం
ఠత్వమునన్ సుధామయక నద్విమలాంగమునన్ మహాఖిలా
సత్వయుతాచలాధిపతిసౌధములప్పురిలోన నింపుమా
శ్రిత్వము నెట్లు చెందవు కులీనమణీంద్రనిబద్ధభూములై.

క॥ భవనాట్టకుట్టిమమహీ
స్రవదిందుమణిప్రవృద్ధజలసురనది యీ
భువిఁ బ్రతిచంద్రోదయమునఁ
దివురుచు సాధ్వీవ్రతౌచితి న్వహువ దటన్.

చ॥ కినిసిసముద్రుఁడానగరఖేయముతోఁ గడుఁ బోరి నీరసాం
బునివహుఁడై నిరంతరముఁ బూనిముఖంబున దీనభావమున్
ఘనతరనీలచిహ్నమును గాంచె నిజం బదిగాక యెట్టులం
దనరు వినీలలాంఛనవిధానము వారిధికిన్ జగంబునన్.

చ॥ కులుకుమిటారులొక్కమొగిఁగుల్కులతోఁదగుజట్లుజట్లుగాఁ
జలకము లాడువేళలఁ బసందగుకమ్మనితావిపొళ్లఁ గే
వలముగ నెట్టవాఱునడబావులుమానినులంబలెన్ విని
ర్మలవిధు లందవేనిసుల రమ్యవిలాసముల న్మెలంగినన్.

చ॥ కలకలమీనునంగడులఁగమ్మనితావుల నుప్పతిల్లుపు
వ్వుల నటియించుతేంట్లఁగని పొల్పగుకస్తురిఁ బోల్చుచట్టిసౌ
ధులు కలనైజముం దలఁపఁదూకొనఁజాలరురుఘుస్తుటుంచు గ
నులకమృతంబయట్లరొదనూల్కొనఁజేసిసఁగాని యచ్చటన్.

ఉ॥ చారుతరేంద్రనీలమయసౌధతలాగ్రములందుఁ జేరి శృం
గారరసంబు మీఱ నిజకాంతులతో రతులందువేళ నీ

హారమయూఖుఁ గాంచి దివినంబరవాహినిలో విచిత్రలీ
లారుచులం జెలంగుకమలంబని యెంచిరి ముగ్ధలచ్చటన్.

మ॥ వెలయన్ సుందరసౌధవీథుల నిశన్ వేడ్కం గడుం గామలీ
లలకుం జొక్కి విలాసినీమణులు హేలన్ నిద్రలం జెంద వా
రల నైతాళికులట్లు మేలుకొలుపున్ రమ్యామలస్వర్గసై
వలినీహేమపయోజపాళిచరదివ్యక్వాణకాదంబముల్.

ఉ॥ ఆనగరాంగనామణుల కాబుధరామలకున్ విభేదమీ
మానవలోకమందుఁ గలమానవు లేర్పఱుపంగ లేరటం
చానలినోద్భవుండు మనుజాంబుజలోచనలన్ నిమేషసం
ధానముఁ దేటతెల్లముగఁ దాఁ బ్రకటించె నుపాయశాలియై.

చ॥ అమలసుధాంశుకాంతమయహర్మ్యతలంబులఁ దత్పురాంగనా
సముదయమెల్ల గానముల సల్పుచునుండ నటన్ బుధాంగనా
సముదయ మేగుదెంచి విలసత్సురలోకమహావిలాసముల్
ప్రమద మెలర్పఁ జూపుసురు వారికి నెచ్చెలులట్ల నేయెడన్.

✓ క॥ ఆనగరము రవివంశాం
భోనిధిచంద్రుండు నిఖిలభూపాలశిరో
మానితుఁడు హరిశ్చంద్ర
క్ష్మానాథుఁడు సంతతంబుఁ గాచుచునుండెన్.

సీ॥ కలిజితాఖర్వవిక్రమగర్వదుర్వార
నిఖిలశాత్రవకుంభినీధవుండు

సమరాంగణాభీల శౌర్యాంచితేంద్రాది
బుధమాననీయసంపూర్ణబలుఁడు
నిఖిలక్షితీశ్వరానీకకోటీరమం
డితరత్నకాంతిదీపితపదుండు
శ్లాఘనీయజయభేరీఘోరభాంకార
నిక్వాణపూర్ణదిఙ్నిచయకుండు

గీ॥ నమలసత్కీర్తిభరితరోదోంతరుండు
జండభుజదండతాండవమండలాగ్ర
ఖండితసమస్తశాత్రవమండలుండు
నగుచు నలరె హరిశ్చంద్రుఁ డనవరతము.

సీ॥ తనజయానిల మమిత్రవిలసత్కోటీర
విమలరత్నప్రదీపముల నణఁపఁ
దనమహోగ్ర శిలీముఖనివహంబు విరోధి
మస్తకాంబుజరక్తమద్యమానఁ
దనశౌర్యరవి వైరిధాత్రీశ్వరాంగనా
గణకేశపాశాంధకారమణఁపఁ
దనవాహినీవజ్ర మనుపమానప్రతా
పవిరోధిధాత్రీధ్ర నివహమణఁపఁ

గీ॥ దనమహాకోపవీతిహోత్రంబు వైరి
భూమినాయకమణిసౌధముల దహింప
సకలభూమీశుఁ డగుహరిశ్చంద్రభూపుఁ
డఖిలగీర్వాణసన్నుతుండై చెలంగె.

సీ॥ కరుణారసంబున సరసిజాక్షునిఁబోలు
నఖిలవిద్యాశ్రేణి నజునిఁబోలు
నిఖిలవైభవముల నిర్జరేశ్వరుఁబోలు
విక్రమంబునఁ గ్రౌంచభేదిఁ బోలు
గాంభీర్యమున విశాలాంభోనిధిం బోలు
సౌందర్యమునఁ బుష్పశరునిఁబోలు
ధనమహానిధులందుధననాయకునిఁ బోలుఁ
బ్రారంభముల భగీరథునిఁ బోలు
గీ॥ శాంతిధర్మంబునను మహీసతినిఁ బోలు
సద్యశంబునఁ బూర్ణిమాచంద్రుఁ బోలుఁ
బరమపావనసాకేతపురవరంబు
జగతిఁబాలించుశ్రీహరిశ్చంద్రుఁ డెపుడు.

సీ॥ మత్తవారణకదంబములందె మదవృత్తి
మధుకరంబులయందెమలినగుణము
సౌదామినులయందెచపలస్వభావంబు
మానినీగతులందె మాంద్యగుణము
మిథునసంగతులందె మేలైనబంధంబు
లర్ధశీతాంశునియందె కొఱఁత
వల్మీకములయందె వరభుజంగభయంబు
కృష్ణపక్షములందె కెఱలుతమము
గీ॥ ఘోరహర్యక్షపోత్రిగాధారవార
ణాదిమృగములయందె క్రౌర్యంబుగలదు

కాని మఱి యెందుఁ జూచినఁ గానఁబడునె?
యలహరిశ్చంద్రుఁ డేలురాజ్యంబునందు.

సీ॥ గహనంబులందె కాక సుమనోభావంబు
వెలయునవ్వీటఁబౌరులకుఁ గలదు
గంధంబునందె కాక మహితామోదంబు
పుడమిలోపల జనంబులకుఁ గలదు
గగనంబునందెకాక ఘనలక్ష్మము సర్వ
పురజనప్రనిచయంబులకుఁ గలదు
లలితగాంగేయచేలమునందెకాక సు
గుణచయంబు జనులకుం జెలంగు

గీ॥ మహితధానుష్కకరసరోరుహములందె
కాక ధర్మము జనులకుం గలదు కాని
సత్యపాత్రుండు శ్రీహరిశ్చంద్రుఁ డెపుడు
రాజ్య మొనరింప నొక్కకొఱంత గలదె?

సీ॥ ఇటుల నాధాత్రీతలేశుండు దుర్మదాం
ధు లగుశాత్రవమహీశుల రణాంగ
ణమున గెల్చుటఁజేసియమరినజయలక్ష్మి
యోయనం జెలువారునువిదఁ జంద్ర
మతిఁ బెండ్లియాడి యాసతియందులోహితుం
డనుకుమారు మహాగుణాఢ్యుఁ బడసి
వివిధాధ్వరంబుల విధివిధానంబున
నతివైభవంబొప్ప నాచరించి

గీ॥ నిత్యసత్యవ్రతుండై వనీపకప్ర
తతిధనీకరణప్రౌఢి హితము మెఱయ
ధరణి ధిక్కృతగీర్వాణసురభి యగుచుఁ
జెలిమితోడుత రాజ్యంబుఁ జేయుచుండె.

వ॥ అట్టిసమయంబునఁ ద్రిదివంబున శచీమనోహరుండు దిక్పా
లాదినిఖిలబృందారకసందోహంబు సేవింప నతివైభవంబునఁ
బ్రాభవంబు మెఱయఁ గొలువుదీర్చియుండి తత్సభాసం
దర్శనకౌతూహలంబున నట కరుదెంచిన వసిష్ఠవిశ్వామిత్రా
త్రేయాగస్త్యపులస్త్యాది మానిపుంగవుల గారవించి యుచి
తాసనంబుల నియమించి వారికిట్లనియె.

సీ॥ మునులార ! ముల్లోకములఁ జరింతురు మీరు
తమ రెఱుంగనిరహస్యములు లేవు
కావున మూఁడులోకముల నెందే నెప్పు
డేని బొంకనియట్టివానిఁ గాంచి
యుండు రేని మదిలోసందియంబును వీడి
నా కెఱింగింపుఁడు నా మునీంద్రు
లొండొరుం గాంచి యాయుర్వీతలాధీశు
నతినిశ్చయాత్ములై యరయఁ దొడఁగి

గీ॥ రట్టిసమయంబున మునీంద్రుండగు నరుంధ
తీశ్వరుఁడు లేచి దేవలోకేశ్వరునకు
నభిముఖుండై నిలిచి నిర్జరాధినాథ !
యని కరంబెత్తి యిట్టు లిట్లనుచుఁ బలికె.

గీ॥ నీవు ప్రశ్నించినట్టిభూనేత వర్త
మానమానవలోకేశుఁ డైనయట్టి
శ్రీహరిశ్చంద్రుఁ డనుధరిత్రీతలేంద్రుఁ
డొక్కరుఁడుండె నియ్యది నిక్కువంబు.

చ॥ అనివచియింప నందుకు వియచ్చరమౌనివరేణ్యు లందరే
మనుటకుఁదోఁచకయ్యెడలనట్టె యెగాదిగఁ జూచుచుండఁగా
మనమునదానికొప్పుకొనుమాటలుమానిమహాగ్రహంబుమూ
ర్తిని ధరియించినట్లు మునిధీరుఁడుగాధి తనూజుఁ డంతటన్.

ఉ॥ అక్షుల విస్ఫులింగనిచయంబులు రాలఁగ లేచి యాసహా
స్రాక్షునివైపునం దనదుహస్తము సాచి మహోరయంబునన్
దీక్ష వహించి ఘోరఘననిక్వణము ల్వొని సైపలేనివా
ర్యక్షముమాడ్కి మౌనివరులందఱఁ జూచి వచించె నీగతిన్.

సీ॥ మునులార ! యీశచీంద్రునిమ్రోల నీమంపుఁ
డనుపమానతపోధనాఢ్యులైన
వామదేవాత్రిదేవలపులస్త్యాదిమా
నులకెల్లఁ దలవంపుగలుగఁ బరమ
బహుతపశ్శక్తిచే బ్రహ్మిభవించి వా
రిజసంభవుఁ దిరస్కరించి యుండు
ననుఁ జూచియేని డెందమున శంకింపక
తా నొక్కమొనగాఁడుగా నటించి

గీ॥ యాలకింపఁగరానివాక్యముల బింక
ముగ వచించుచు నున్నాఁడు జగతి వినిన

వారు నవ్వుదురనుశంకవలదె ? యిట్టి
వింతయున్నదె ? మీరలు వింటిరి గద.

ఉ॥ కల్లల పుట్టినిండ్లయి జగంబున వర్తిలుచుండుమేదినీ
వల్లభు లేడ ? సూనృతపువాదము లేడ ? త్రిశంకుపట్టి తాఁ
గల్లలనాఁడడంట హితకాముఁ డితండు నెఱుఁగునంట యీ
చెల్లనిమాట లిప్పగిదిఁ జెప్పఁగఁ జెల్లునె? యింతయేటికిన్.

గీ॥ పౌసఁగ నీజోగి యమ్మహాభోగికినిఁ బు
రోహితుండు కావుటచేఁ బురోహితాభి
లాషియై యివ్విధమునఁ బల్కెఁగ సాహ
సించుచున్నాఁడు మది విచారించ కిపుడు.

వ॥ కావున నీరహస్యం బెఱింగినమాదృశులే తాదృశవాక్యంబు
లాలకించి సహింతురేయని యరుంధతీజాని కభిముఖుండై
గీర్వాణభూవల్లభుండు సత్యసారమారయం దలంచినవాఁడు.
అట్టి మహేంద్రునిమ్రోల నీవాక్ప్రౌఢిమం జూపందలంచి
తివె ? నీగర్వంబు సర్వం బణఁగఁద్రొక్కక కౌశికుం డూరక
విడుచునే ? రాజ్యభోగంబు లనుభవించు భూవల్లభు లేడ ?
సత్యవాక్యంబులేడ ? ఎట్టివారికైనం బాటింపనలవికాని
సూనృతవ్రతంబు లోకోత్తరశాకపాకాదిపదార్థంబు లార
గించు మదాంధులగు ధాత్రీనాయకు లాదరింతురా ?
యేల యీవలపనిపలవరములని యాక్షేపించుగాధేయుం
జూచి పాదతాడనంబున లేచునురగంబు తెఱఁగునఁ గోపా
టోపంబుద్దీపింపవసిష్ఠుండు వానికిట్లనియె.

సీ॥ ఓరాచతపసి ! యీనీరాచచిన్నెలు
వెల్లడింతువు కాని చెల్లవిచట
నీకంటె గొప్పవారేకదా వీరలు
వారికి లేనికోపంబు నీకుఁ
గలుగఁ గారణమేల ? కలకాల మిట్టిదా
ష్ట్యంబె సూచింపనేమంబు గలదె ?
ముప్పతటినినైన మొప్పెతనంబు ద
ప్పించుటొప్పగు నిద్దిమంచితనమె ?

గీ కాన నిఁక నిట్టిమాటలుమాని మెలఁగఁ
దలఁకొనుము తెల్విగలవారు మెలగుచోట
నొక్కసంపన్నుఁబేర్కొన నొప్పదంటి
వెప్పుడున్న దినుడువుట తప్పుగాదు.

సీ॥ అరయ దివాంధంబులగు ఘూకములతోడ
క్షీరనీరంబుల వేఱుపఱచు
హంసంబుఁ బురుడించునట్లు మోహాంధులౌ
క్షుత్రబాధులతోడ సత్యనియతుఁ
డగుహరిశ్చంద్రభూపాగ్రగణ్యునిఁ బోల్చు
టేటిమార్గం బదేపాటిఘనము
సరసీజగంధంబు చంచరీకముపోలెఁ
గప్ప కెఱుఁగరానికరణి వాని

గీ॥ సత్యనిత్యత సారజ్ఞజాలమునకుఁ
గాక యితరుల కెఱుకయే ? గాధిపుత్ర !

లేనిపోయినపోరాటమూని యిట్లు
పలుక నీవంటివారికిఁ బాడియగునె ?

చ॥ ఇనుఁడపరాద్రిమీఁదనుదయించినమేరువుధాత్రిఁ గ్రుంగినన్
జనవినుతుండు పావకుఁడుశైత్యముఁబొందినదీక్షఁబూనియా
జనపతిజిహ్వ యేయెడ నసత్యముఁబల్కునె ? సత్య మిద్ది దీ
నిని నిఁకఁ గాదటంచనువినీతుఁ డెవండనిపల్క నయ్యెడన్.

వ॥ అందులకు విశ్వామిత్రుం డాజ్యాహుతులం బ్రజ్వరిల్లుధనంజ
యునిచందంబునఁ బ్రచండకోపోద్దీపితుండై మండిపడుచు
నీవచనంబులతెఱంగు నేనువిచారించిచూచెదనన నందులకుం
దాపసగరిష్ఠుండగు వసిష్ఠుం డిట్లనియె.

గీ॥ ఆహరిశ్చంద్రభూమీశుఁ డఖిలసంప
దాళితో నాలుబిడ్డల నందఱనుఁబ
రిత్యజించునుఁగాని తాసత్యమునుఁ బ
రిత్యజింపంగ నేరడు నిత్యమనుచు.

సీ॥ అటుచేసెనేని నేనాక్షణంబునఁ బరి
త్యక్తాత్మధర్ముండనై సురాప్ర
పూరితంబగు మానవునికపాలంబుఁ జేఁ
బూని యామ్యదిశకుంబోవువాఁడ
నని ప్రతిజ్ఞ యొనర్ప విని కౌశికుండు నే
నవ్వాని బొంకింప నైతినేని
హిమవన్నగంబున నెంతయు నిష్ఠతో
సల్పినతపములో సగఫలంబు

గీ॥ నానృపతికిచ్చి యొచ్చెంబులేనికలిమి
నేడుదీవులతోడి మహీతలంబు
నంతయు నవక్రలీల నేలింతు నిఖిల
పార్థివోత్తమనిచయంబు బళియనంగ.

గీ॥ అంతమీఁదట నాథరాకాంతు సుగుణు
నమరపదునాల్గుమన్వంతరములు మహిత
నాకనాయకు నర్ధాసనమున నుంతు
నని మహాశపథ మొనర్చె మునులు బెగడ.

వ॥ అంతం బెక్కులు దుశ్శకునంబులు గానరా సురేశ్వరుండు నానిమిత్తంబున హరిశ్చంద్రసార్వభౌమున కెట్టియిడుము పాటు రానుండెనోగదా యని చింతిల్లుచుం గొల్వుసాలింజె. తక్కుంగల విబుధనికురంబంబు లీనెపంబున నాసర్వంసహా నాయకునిసత్యవ్రతంబు గననయ్యెం గదాయని తలంచుచు నిజాలయంబుల కరిగిరి. వామదేవాదిమహామునిపుంగవు లెల్లరుఁ గ్రక్కునం దమయిక్కలకుం జనిరి. నసిష్ఠుండు విశ్వామిత్రునిశపథంబుమెచ్చుకొనుచుం గ్రమంబుగ భూతలంబునకు డిగ్గె. విశ్వామిత్రుండు హరిశ్చంద్రు బాధించు నుపాయంబు నాలోచించుచు నిజాశ్రమంబుం బ్రవేశించె.

ఉ॥ ఆసమయంబునం బుడమినానరపాలకుఁ డొక్కయాగముం
జేసి సమస్తదానములుసేయుచు నుండుటఁ దా నెఱింగి నా
కీసమయంబె యుక్తమని యొంతయువేడ్క నయోధ్యకేఁగ ల
క్ష్మీసహితుం ద్రిశంకుసుతుఁ గీర్తియుతుం గని వానిచేరటన్.

సీ॥ ఉచితసత్కారంబు లుల్లాస మెసఁగఁ గై
కొని వానితో నిట్టులనియె నృపతి!
కల్పవృక్షంబు నొక్కరసాలఫలముఁ గో
రగఁబోవుమూఢునిపగిది నేను
క్షితిపతీశ్వరులలోనతివదాన్యుని నిన్ను
నడుగవచ్చితి నొక్కయల్పఫలము
నది యెద్దియనినఁ జెప్పెద నాలకింపుము
తడవులం బట్టి యీపుడమి నొక్క

గీ॥ జన్న మొనరింపఁ దలపెట్టుకొన్న వాఁడ
దాన నీశుండు ప్రీతుఁడౌ దానికిపుడుఁ
నొక్కయున్నతగజముపై నెక్కినట్టి
మానవుఁడు నిక్కి నిలిచి నెమ్మానికంబు.

గీ॥ మింటి కెగమీాట నెంత యెత్తంటిపోవు
నంతధనరాశి గావలె నయ్యది భవ
దన్యులంను నలభ్యంబయుగుట నిన్ను
నాశ్రయింపంగ వచ్చితి నవనినాథ!

గీ॥ చెలఁగి విహితాధ్వరవిధానుఁజేతువో య
సంవిధానునిఁ జేతువో ఖ్యాతలేంద్ర!
యని కరంబును సాచి నిల్చినమునీంద్రుఁ
గాంచి యిట్లనె నాభూమికాంతుఁ డపుడు.

సీ॥ గాధేయ! యుష్మదాగమనంబునం జేసి
నామయాగంబు ధన్యత వహించె

నేఁ గృతార్థుఁడనైతినాగృహంబు పవిత్ర
మాయె నీసమయంబునందు భక్తి
తోఁ భవాదృశమునిస్తోమంబులకు నీయఁ
గాంచుటెంతయు మేలుగాదె? యింక
బహుకటాక్షమునఁ గావలసినవిత్తంబుఁ
గొనఁ జిత్తగింపుడంచని ధనాల

గీ॥ యముఁ దనయధీనముం జేయనామునీంద్రుఁ
డౌర దాతృత్వమన్న నియ్యదియకాని
వేఱుగానున్నె? నీవంటి విశ్వనాథుఁ
డన్యుఁడొక్కఁడు గలఁడె? వదాన్యచంద్ర!

సీ॥ అనుచు నగ్గించి దిగ్గునలేచి యింక నా
యజ్ఞంబునకుఁ గొంతవ్యవధి గలదు
అవసరంబగుడు నేనరుదెంచి తోడ నా
యర్థంబుఁ గొనిపోదునంతవరకు
నీధనాలయమునందే యుండనిమ్ము నీ
కాయురారోగ్యంబులయ్యెడు నిఁక
నేఁ బోయివచ్చెదనీవుండుమని చెప్పి
మునివల్లభుఁడు గాధిపుత్రుఁ డరిగె

గీ॥ నంత నాహరిశ్చంద్రభూకాంతుఁ డితఁడుఁ
గోపనుఁడు దానుగోరినగొప్పవిత్త
మిపుడ గైకొనకుండనేఋుణము నాపు
పైన నిడిపోయెనని తెల్వితోనె యుండె.

గీ॥ అట్లు చని కౌశికుండు కోపాగ్ని మెఱయ
క్షత్రకులవీరు శ్రీహరిశ్చంద్రనృపతి
నిపుడు బొంకించుసదుపాయమేమి యనుచుఁ
బ్రీతి విడనాడి మది విచారించి పిదప.

గీ॥ కొంతవడికిని డెందంబుకుదురువడగ
హరిణశార్దూలశరభహర్యక్షపోత్రి
ఖడ్గగజముఖదుష్టమృగములఁ జేసి
యతనిదేశంబుమీఁదికినంపె నపుడు.

ఉ॥ అంతటనామృగంబులుభయంబొనఁగూర్చుచునుక్కుమీఱి ర
వ్వంతయు భీతిలేక యెటనైననుఁజూచినఁ దామెయాచు వి
భ్రాంతిఘటించుచున్ జనుల బాధలఁ బెట్టుచుఁ బైరులెల్లని
శ్చింతల నేలమట్టముగఁజేయుచు నున్నవి భూరిదీక్షతో.

శా॥ దానం గాసిలి పౌరులెల్లరెద నుత్కంపంబు పెల్లుబ్బ నా
భూనాథోత్తముఁ జేరి వందనశతంబు ల్గూర్చి రాజేంద్ర! మే
మేనాడైన భవత్కృపారసముచే నిన్నాళ్ళుదాఁకిట్టి బా
ధానీకంబు లెఱుంగకుంటి మిఁకమీఁదన్ దాళలే మిప్పురిన్.

ఉ॥ ఏపున మేరలేనియసహిష్ణుపరాక్రమ మొప్ప నిప్పుడే
పాపమొ లెక్కలేనిమృగపంక్తులు మేదినిఁ బుట్టినట్లు సం
తాపముఁగూర్చుచున్ జనవితానములన్ గృహసస్యభూములన్
రూపఱఁజేయుచున్నవి విరోధులు దోపిడికాండ్రనుంబలెన్.

ఉ॥ కావున నీమృగార్తి తొలగంగనొనర్చి దయాత్మ మమ్ములం
బ్రోవుమటంచు వేడ నృపపుంగవుఁ డాతఁడు వారిఁ జేరి మీ

తావుల కింక మీరరిగితాలిమిఁ బూని వసింపు డెల్లి స
త్త్వావళిఁ జంపి మీయిడుమలార్తునటంచని పంపి వారలన్.

వ॥ మఱునాడరుణోదయంబున లేచి కాల్యకృత్యంబులు నెర వేర్చికొని వాటంబగు వేటతమకంబున సతీసుతామాత్యులు వెంటరాఁ గతిపయపరివారసమేతుండై మనోవేగాధికజవంబుగలహయంబులం బూన్చినయరదం బారోహించి యుత్తరాభిముఖుండై కదలి తనకుంగట్టెనుటుం గాన్పించిన మృగంబులం బరిమార్చుచుం జేనిచని యొక్కమహారణ్యంబు బ్రవేశించె. అయ్యరణ్యం బల్లనల్లన నుల్లాసంబులు మీఱ నలిబిల్లిగనల్లుకొని చల్లదనంబున కిల్లగుసంపుల్లమల్లి మతల్లికాదిపరివేష్టితలతామంటపంబులును,దిట్టంబగునాకటం గొట్టువడి తట్టుకొనలేక చీమలకుం జెదలునకు నెలుఁగులు గులగులనినాదంబులతోఁ బుట్టలు వితతనిశాతనిజనఖరకులిశాంచలంబుల గోరాడ నచ్చోతలనుండి వెడలి చనుదెంచు పాపరాజుల నల్గడలన్వడిసిపట్టి చెఱకుదంటులంబోలెఁ బీల్చి చప్పరించుచు నొండొంటికిపేరెంబులువాఱికువాళించి తప్పించుకొనుదుప్పులగిట్టలదువారంబులు గ్రమ్మి మసకవడి కానరానిగండోపలంబులును, పరిహాసతనీలోపలంబులపుష్పాగ్రంబుల నొప్పారువిషాణపరిఘుంబులొండొంటిం దాకి సెగిల్లు మనుకోలాహలంబుల గుహలఁ బ్రతిధ్వనింపఁజేయుకాసరంబులును, నిశితనిజనఖరకులిశవిదారితవేదండపలలఖండంబుల మెసవి మత్తిల్లి మార్గమధ్యంబుల సంచరించు పంచాననసంచయంబులును, మల్లీవల్లీమతల్లీపరివేల్లితరసాలకిసలయవి

సరఘాదనమత్తకోకిలనికరకలకలకలంబులును, పరిహసితనీల మణి లీలాశాలివిచిత్రవర్ణకంధరశిఖావల కులకలకేకారవంబు లును,తుంటవిల్కానిచిహ్నంబులందేలాగోరి చెలంగుపొటిపొదు లంపుఁ దగులాటముగలిగి చిల్లరసలుగులం బిల్లలం జుల్ల రంబులఁ బోఁదోలి మలయుచుఁ బిహుదం దిరుగుచంటి పిల్లల వెంబడించువృకంబులను సివంగులను మరలించు నడవిపందులమొత్తంబుల సవ్వడులచే నిండుకొన్ననికుంజ పుంజంబులును, గలిగిచూపఱకు మహాభయంకరంబయ్యె. అప్పుడాసార్వభౌముం డంపునం గలగండకవేదండవరాహ శార్దూలకంఠీరవాది ఘాతుకమృగతండంబుల నెగిచియెగిచి వేటాడసమకట్టె నంత.

చ॥ అనితరసాధ్యవిక్రమమహాధృతులం జెలరేగి పోతరిం
చిన మదకుంభికుంభములఁజీలిచి నెత్తురుఁద్రావి యీరుపుం
దినివిహరించుకేసరితతిన్ సమపాయముఁజూచియొక్కతూ
పుసఁ బరిమార్చె నానృపతిపుంగవుఁడయ్యెడవీరమూర్తియై.

ఉ॥ బోరుస నింగిముట్టురవము ల్పచరించుచు సంతతంబుఁ గే
దారములం జరించుజనతండము హూపఱఁజేయునట్టిభూ
దారవితానముం గెడపి తక్కినవన్యమృగాళికిన్ మహో
దారభయంబుఁగూర్చె వసుధాస్థలినాత్మయశంబు నిండఁగన్.

సీ॥ కడువేగమున లేచి గగనంబునం బౌఱు
హరిణంబు నొకదానిసల్లెకూల్చె

సీటుగా దవడలఁ దాటించునొకపోత్రి
నొక్కబాణముతోడ నుక్కణంచె
లతికాలయములోఁ జెలంగుశార్దూలంబుఁ
బాణాహతిని నేలపాలొనర్చెఁ
బాదపంబెక్కి శబ్దము మానియొదుఁగు నె
ల్గు నొకదానినిఁ గత్తిఁగూలనేసె

గీ॥ భూమిగర్భంబునను దాగిపోతరించి
నేత్రయుగ్మంబు మెఱయఁ గాన్పించునొక్క
సింహరాజంబుఁ బరిమార్చె క్షితివిభుండు
సైనికులు తన్ను శ్లాఘింప సంతసమున.

వ॥ ఇవ్విధంబున నాచ్ఛోదనకేళి యొనర్చిపురంబునకు మరలి వచ్చుచు దైవవశంబున నరుంధతీమనోహరునాశ్రమంబుఁ బ్రాపించి తదుపదిష్టహితోపదేశంబు డెందంబున స్థిరంబుగ నిల్పి కదలిపోవుచుండ విశ్వామిత్రునిచే సృజింపఁబడిన యొక్కహేమహరిణంబుం జూచిదానిసౌందర్యంబున కచ్చెరువడి చంపక యలయించి పట్టుకొని నగరంబునకుం గొనిపోవుతలంపునం దఱుమ నయ్యది పఱచి హరిశ్చంద్రునిఁ గడుదవ్వుం జేర్చి విశ్వామిత్రునాశ్రమంబు చెంతఁ మటుమాయంబయ్యె.

ఉ॥ పిమ్మట నానృపాలునకు భీతియు నానయు దీక్షయాత్మలోఁ
గ్రమ్మఁగ దానిజాడల నెగాదిగ నారయుచుణ్ రవంతదూ

రమ్మున నుండి పావనతరంబగునాశ్రమ మొండు గానరా
నమ్మనుజేశ్వరుం డచట నాశ్రమ వాయగ విశ్రమింపఁగన్.

ఆ॥ వె॥ తలఁచి దానిచెంతదారాత్మజులతో ర
థంబు డిగ్గి తనదుదండనాథు
తోడ దానిసొబగునాడి శ్లాఘించుచుఁ
బ్రముదమునఁ దదంతరమునఁ జొచ్చి.

సీ॥ వనజాప్తుఁడనుమృగయునిదాడికోడి వే
గమునఁబొలెసుపధికమృగతతుల
దగఁబాపి మనుచులతాకుసుంగంబులు
వ్యోమంబునంటి మొండొంటిఁ బెనఁగి
ప్రాకుచు నాకుజొంపములసొంపున నెండ
పొడలఁ జూపనివృక్షముల నెసంగు
తీరంబులును నట్టితీరంబులను ముంచు
నలలపై నుండి యుయ్యాలలూగు

గీ॥ రాజహంసంబులును నట్టిరాజహంస
ములు దినగ లాగుబెసనంతతులఁ గరాళ
ఫణిఫణనస్ఫుటలవిభాసఁ బరగువికచ
కమలములు నట్టి యాకమలములనూడి.

గీ॥ తొఱగుతేనెలఁ ద్రావి మత్తుగొను తేంట్ల
కలకలంబుల కనుకారములగుకీర
శారికాముఖశకునజాలారవములు
గలిగి తనునొక్కపంకజాకరముఁగాంచి.

గీ॥ మేనివడ దీఱఁగా నంబుస్నానపాన
ముల సలిపి దానిఁగట్టుననలరుపొదల
నడుమఁ గనుపట్టుచంద్రకాంతమణివేదిఁ
గలికియూరువులుపధానకములుగాఁగ.

వ॥ శయనించి కొండొకతడవు నిద్రించి తాఁ బేరోలగంబున సిం
హాసనాసీనుండై యుండుతఱి నొక్కమునిపుంగవుండే తెంచి
దానినుండి దిగువం బడంద్రోచి తనవామపాదంబున మస్త
కంబున రత్నకాంతుల ధగద్ధగాయమానంబగుకోటీరంబు నే
గిరి పడఁదన్నిన ట్లొక్కదుస్స్వప్నంబుఁ గాంచి యదిరిపడి
లేచికలవరింపం దొడంగె నంతఁ జంద్రమతి బెదరి తుదను
హృదయంబు పదిలపఱచుకొని తగువచనంబుల నాతనికలవ
రంబుడిపి వానివలన దానికిం గారణంబారసి యింక నిరా
డంబరంబు తడయుకపురంబునకేగుదము లెండనిపలుక్కుచున్నంత
లో విశ్వామిత్రుం డదియదనుగా నెంచి కోపోద్దీపితమాన
సుండై యించుకధ్యానించి పిమ్మట.

చ॥ నలినములన్ హసించునయనంబులు జెక్కుదనంబు గల్గి యు
క్కలువలజేనిఁబోలెడిమొగంబులు నద్దములం గదల్చుచె
క్కులువిరిబంతులం దెగడుగుబ్బలుసింహముఁబోలుకౌనులుం
గలిగి రతిన్ హసింపఁగలకన్యల నిర్వురఁ జేసి పంపినన్.

శా॥ ఆచండాలకులాంగనామణులు నొయ్యారంబులొప్పారథా
త్రీచక్రాధిపు నానృపుం గదిసి ప్రీతిన్ వానికిన్ గానవి

ద్యాచాతుర్యము నాట్యకౌశలవిచిత్రత్వంబులం జూపి ధ
ర్మాచారంబులుద్రోసిపుచ్చకవివాహంబాడుమాయిర్వురన్.

చ॥ అనివచియించుచున్ సరసమాడుచుఁజెంతకు రానతండు న
వ్వనజదళాయతాక్షు లనువాక్యములన్విని సైపలేక వెం
టనె కడుసాహసంబున నొడ ల్నలియంగ నడంచి వెళ్లగొ
ట్టె నది యెఱింగి పాదహతిఁడీకొనుకాలభుజంగమో యనన్

గీ॥ బుసలఁ గొట్టుచువచ్చి యామునివరేణ్యు
డానృపుండు స్వప్నంబు గన్నంతవట్టు
ననుభవంబునకుం దెచ్చె నంతనాజ
నవిభునర్యుండు నాత్మగౌరవము వీడి.

సీ॥ పైకొన్న నెంజలిం బద్ధాంజలియు నౌచు
నామునీశ్వరునిపాదాంబుజముల
వ్రాలి లేవకయున్నబహుకృపాత్ముఁడువోలె
రాజేంద్ర! నీవింకఁ బ్రమకఁ దలఁతు
వేని నాకన్నెలనీరీతిఁ గొట్టినం
దులకుఁ బ్రాచితముగా నలరువారిఁ
జేపట్టుమనఁగ నాక్షితినాయకుఁడు హరి
హరి యెంతమాట నేనాలకించి

గీ॥ తినని చెవులు మూసికొని గాధేయుఁ జూచి
యతిశయనమస్కృతుల భక్తి నాచరించి
యిట్టిగొట్టుమాటల జాలిఁబెట్టుదాని
కన్న నను మట్టువెట్టుటేమన్న మేలు.

వ॥ వలయునన్న నాసామ్రాజ్యంబు సర్వంబుం బరిత్యజింతుం గాని కులశీలంబులు విడువంజాలనని యార్తిమెయిం బల్కు దానం బిక్కుపట్టి యాటక్కరిజడదారి వానితో నిట్లనియె.

సీ॥ జననాథ! నీవుభాస్కరవంశసంభవుం
డవు సత్యవర్తనుండవు మృదూక్తి
జితశారికలగునాచిన్నిబిడ్డలఁ బెండ్లి
యాడక రాజ్యంబువీడుదునని
పల్కియుంటివి; దానిభంగంబుసేయక
యిపుడ నీరాజ్యంబునిమ్ము నాకు
ననుచు నిర్బంధింప నట్లె రాజ్యముసంగ
మంత్రియు జాయాకుమారులపుడు

గీ॥ వెంటరాఁ బురమున కేగి వివిధపౌర
జానపదులకు నీసమాచారమెల్ల
దెలియఁ జెప్పఁగ నోధరిత్రీతలేంద్ర!
మముల నిటువీడిపోవ ధర్మంబె? నీకు.

ఆ॥ వె॥ అనుచు సంగలార్వనందఱుఁ దగుమాట
ల నోడఁబఱచి మరలితనసతీసు
తులును దాను గహనములకంతవెడల నా
తాపసుండు వానిదరికిఁ జేరి.

వ॥ నరేంద్రా! పూర్వదత్తంబగుమావిత్తంబు చెల్లింపక యట్లె పోఁజూచెదవు. ఇయ్యాదిసత్యసత్యవ్రతానుష్ఠానపరుల మార్గంబె? యనివివిధంబులగు నిష్ఠురంబులాడి యాహరిశ్చం

ద్రుం డదియు నెందేని సంపాదించి యిత్తునన్న నిన్నెవ్వరు విశ్వసింతురని తన్నుంబోలెఁ గుటిలక్రియారతుండగు నక్షత్రకుండను ప్రియశిష్యుం బాపి యందులకై భార్యాపుత్త్రుల నమ్మించియు వానిం జండాలకింకరునిఁగా నమ్మించు నెట్టియుఁ బన్నగదశనంబునఁ గుమారుం బంచత్వంబు నొందించియు లేనియపవాదలఁ జంద్రమతిం బొందించియు, నసత్యమా డింపనేరక హరిశ్చంద్రునిసత్యనిత్యత్వంబునకు మెచ్చి సాక్షాత్కరించినత్రిమూర్తులకుం దనపంతంబు తెఱంగు విన్న వించి లక్ష్మీనాథునిం బ్రార్థించి సుదర్శనచక్రం బానృపా లునిపనుపునడుప ననుగ్రహింపం జేసి యతికరుణారసపూరిత మానసుండై యాసార్వభౌమునకిట్లనియె.

సీ॥ క్ష్మాతలేశ్వరచంద్ర ! సత్యవ్రతంబున
కాలవాలంబన్న నగుదుపీవె
యలనీమనిత్యసత్యవ్రతంబును జూడఁ
గోరి యిట్టిక్కట్టుల్గూర్చియుంటిఁ
గాని వేఱొండిద్దికాదు నిన్నిట్లస
త్యంబు నాడింపలేనట్టులయిన
నేడుదీవులతోడియీభూమి నిఖిలంబుఁ
బ్రీతి నీచేత నేకాతపత్ర

గీ॥ మగువిధంబున నేలింతునని ప్రతిజ్ఞ
పటితిని నందులకుఁ దగుపరమమహిమ

యునిక నీయంము నెలకొల్పెదనని తనత
పఃఫలంబున నర్ధ మవ్వాని కొసఁగి.

సీ॥ భూమీశ ! యిఁక నీవుభూమిచక్రంబవ
క్రగతిఁ జక్రంబు కార్యము లొనర్ప
నేలుమంచని యాజ్ఞ నిడి తాను మున్న యో
ధ్యాధిపత్యము వీడియరుగుదెంచి
నసుయజ్ఞుఁ గని దీవెనల నిచ్చిసాకేత
పురి హరిశ్చంద్రభూపునకు నిఖిల
రాజ్యయుక్తంబుగ రహి నిచ్చితిమి నీవు
చతురంగబలపరిచారకులను

గీ॥ నఖిలమణిభూషణధనధాన్యనిచయములఁ
దెలియనిడి రొక్కమునకు లెక్క లను జెప్పి
రమ్మనుచుఁ గమ్మ వ్రాసి చేవ్రాలు చేసి
యాహరిశ్చంద్రుసమ్ముఖమందుఁ బెట్టి.

వ॥ నరేంద్రా ! దీనిం గొనిసుయజ్ఞునివలన సామ్రాజ్యాంబు
గై కొమ్మని యాశీర్వచనపురస్సరంబుగా దీవించి పుత్తెంచిః
నాహరిశ్చంద్రుండు శ్రీమన్నారాయణుని కరుణాకటాక్షం
బున సజీవుండై యానందంబున నుండు లోహితాస్యుని
నూడిగంబువీడి యపరలక్ష్మియుంబోలె నుండుచంద్రమతిని
జేరందీసి కౌశికునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి
పుత్రకళత్రసహితుండై కాశికానగరంబుననుండి సాకేతంబ
నకు బయల్వెడలె నంత.

సీ॥ అపుడు నావృత్తాంతమఖిలంబుఁ జారుల
వలనఁ గాశీపురీశ్వరుఁ డెఱింగి
కొలువఁగాఁ జతురంగబలము లాసార్వభౌ
మునకు నడ్డమువచ్చి మనుజనాథ!
మీరు సామాన్యులట్టిరీతిఁ బాదచా
రులును శూన్యపరివారులును నగుచుఁ
జనుదెంచు టిది యుక్తమనఁ జెల్లునే? కాన
నీప్రూట నిలిచి నాయింటఁ దగిన

గీ॥ కొలఁది విందారగించి నాకులము పావ
నంబుగ నొనర్చి ధన్యాత్ము నన్నుఁ జేసి
మెల్లి తెల్లవారినమీఁద నెల్లసైన్య
ములు గొలిచిరా బయలుదేరిపురికిఁజనుము.

చ॥ అనుచు నృపాలు వేఁడుకొనఁ నందుల కాతఁడుసమ్మతించి యా
దినమునఁ గాశినుండి తమిదీరగ నాతని నాదరించి పెం
పునమఱునాడు లేచిబలముల్ గొలువంగన యోధ్య కయ్యెడం
జేన సమకట్టి నెల్లరకు సంతసము గ్గలిగించుకోరికన్.

వ॥ అంతట నిందిరాసుందరీసమన్వితుండగు చక్రధరుండునుం
బోలెఁ జంద్రమతీలోహితాస్యులతో నవరత్నఖచిత
విమానారూఢుండై కాశీపురాధీశ్వరుండు. పురోభాగంబున
మార్గదర్శకుండై నడువ బయలుదేరి యెడనెడ నుపదా
జాతంబులం గొని యెదుర్కొనుభూనాథుల నాదరించి
కొన్నివాసరంబులకుం గోసలరాజ్యంబుం బ్రాపించె నంత.

శా॥ ఆవార్త ల్విని సత్యకీర్తి మదిలో హర్షంబు వాటిల్ల రా
జీవాప్తాన్వయుఁ డీయెడన్ మనల రక్షింపంగ సంప్రీతిఁ దా
నీవేళం జనుదెంచుచుండెనట మీరిట్లాలముం జేయ కెం
తో వేడ్కంగన నేగుడంచుఁ బురమందుం దా సుయజ్ఞానతిన్.

సీ॥ పురమెల్ల శృంగారముల నింపుడీయెడ
ద్వారంబుల రసాలతోరణములఁ
గట్టింపు డిఁక మండిగముల ముత్యాలమ్రు
గ్గులను పెట్టింపుడు లలితరాజ
మార్గంబులఁ గురంగమదసువాసితమైన
కలయంపి చల్లింపు డలరుహీర
ములు గొల్వుకూటంబుముందరఁ గట్టింపు
డెలమితో మానవులెల్ల దేవ

గీ॥ తామహోత్సవముల సల్పి తగినపండు
గల నిపుడుఁ జేసికొనుడంచుఁ గడు రయమున
నల్లపురమునఁ జాటభృత్యప్రవరులఁ
బంపెఁ దా మంత్రి యుల్లంబు పల్లవింప.

వ॥ పిమ్మట సుయజ్ఞుండును సత్యకీర్తిప్రముఖామాత్యప్రవరుల
మున్నిడికొని పౌరులు రా హరిశ్చంద్రసార్వభౌము నెదు
ర్కొని స్వదర్శనంబున నరదంబు డిగ్గి ప్రణతు లొనరించు
నాచక్రవర్తిం గరంబు గౌరవించి యుచితోక్తుల దీవించి
వానికిట్లనియె.

సీ॥ జననాథ! గాధేయమునికల్పితోదగ్ర
మాయాంధకారంబు మహితశాంతి
కమలబంధుప్రకాశమునఁ బోకారిచి
మెప్పంది వచ్చునీగొప్పతనముఁ
గనులార నీయెడఁ గనఁగల్గితిమి లగ్గు
గని మేము మాటిమంచు నుతిసేయఁ
దలపడునమ్మౌనితిలకుని కాత్రిశం
కుతనూజుఁ డిట్లనెఁ హితగుణాఢ్య!

గీ॥ మీగురునియనుగ్రహమున మెప్పుఁగంటి
నాతఁడు ననుగ్రహింప నీ భూతలమునఁ
బడయరానిది కలదె? యేపాటిదైన
ననవుడుసుయజ్ఞుఁ డౌనవుసని వచించి.

మ॥ అలగాధేయుకృపారసంబు కడు శ్లాఘ్యంబీమహీశ దత్తపః
ఫల మీచందమునన్ నిరర్థకము గాఁ బాతంబునన్ మీకు బా
ధలు సేకూరిచి తాఁ గడించినదినిందల్ గాని వేఱున్నె? మీ
రలు సత్యవ్రతులన్మహాయశముమీఱంగంటి రిందందునన్.

వ॥ అనిభద్రగజంబు నొకదాని రావించి యమ్మహాభాగుని
పురోభాగంబున నిలిపి దీని నధిరోహింపుఁడనుడు నాతం
డై రావతాధిరూఢుండగు గీర్వాణనాయకుంబోలె నాగజేం
ద్రంబు నెక్కి తనవెనువెంట మేరువుంబోనిపసిండియరదం
బునఁ బుత్త్రకళత్రంబు లేతేర స్వనగరాభిముఖుండై బయ
ల్వెడలి తోరణద్వారంబు నిర్గమించి రాజవీథి నరుదెంచు

సమయంబునఁ బౌరాంగనలు గగనవిమానంబులనుండి ఏల
కించుసురాంగనలం బురుడించుచు నొండొరులం జీరాం
కొనుచు నిట్లు తలంపం దొడంగిరి.

సీ॥ ఏనరేంద్రుఁడు పంతమూని గాసిలబెట్టు
గాధేయుమాయలఁ గలఁచి మీాఱె
నేసార్వభౌమేంద్రుఁడీసూనృతవ్రతం
బు నెఱవేర్చుటపొంటె పొలఁతిసుతుల
నొక్కపాఱున కమ్మి స్రుక్కి పిమ్మటఁ బూని
తా నొక్కకడజాతివానిఁ గొలిచె
నేరసాధీశ్వరుం డీ రాజరాజేంద్ర
తనుజుల సౌందర్యమున జయించె
గీ॥ నెవఁడు శౌర్యాన షణ్ముఖభవుల గెలిచె
నట్టిపంకేరుహాప్తవంశాంబురాశి
చంద్రుఁడన నొప్పశ్రీహరిశ్చంద్రుఁడిపుడు
వచ్చె నిదె కాంచుఁడనిపల్కఁజొచ్చి రెలమి.

సీ॥ అమ్మరో యిదియేమి యాప్రక్క పైడితే
రెక్కి వచ్చులతాంగి నెలమిఁ గనరె?
పతులె దైవములనుసతుల కిద్దియె న్యాయ
మని తెల్పుచుండెనోయనఁగ నిక్క
గాధేయకల్పితఘనమహామాయాబ్ధి
దాటించుపొంటెఁ దథ్యముగ నంట
రానివేల్పునఁ జొచ్చె నీనాతి దాసియై
యూడిగం బొనరింపనొప్పుకొనియె

గీ॥ నిట్టికులపాలికలు జూడనెందుగలరు ?
రమణి పతిభక్తిఁ గీర్తిచంద్రమతి యగుచు
చంద్రమత్యాఖ్యఁబరగె ముజ్జగములందుఁ
దరమె యీరామఁ బొగడ నాధాతకైన.

సీ॥ ఈమె తా నోఁచిననోములపంటయుం
బోలె మున్నిడుకొన్న బుడుతవానిఁ
గంటిరే? యితఁడు మ్రుక్కడిపాము గఱువంగఁ
బ్రాణము ల్విడనాడిబ్రదికెనంట
గదె? యిట్టినిత్యసత్యదయాపరులవైభ
వంబుఁ గాంచుమనభాగ్యంబదేమొ
యనుచు వారలు చెప్పుకొనుచుండి రటుమీఁద
వారాంగనలతాండవములు చెలఁగె.

గీ॥ వందిమాగధులెల్లఁ గైవారమీయ
గడగి రయ్యెడ నటఁ బుణ్యకాంతలిడెడు
మంగళాక్షత లాదేవమాన్యులెల్లఁ
గురియుకల్పకసుమములసరణి రాలె.

సీ॥ పటహామర్దళశంఖపణవాదివాద్యస్వ
నములెల్ల రోదోంతరముల నిండఁ
బడతులు సేవింపఁబసిడిపల్లకి నెక్కి
నందంబుతోడఁ జంద్రమతి రాఁగఁ
బార్శ్వభాగంబుల భక్తితో సేవకుల్
రమణీయమణిచామరములు వేయ

వందిమాగధులు నానందించుచుం బురో
భాగంబునందుఁ గై వార మీయ

గీ॥ విప్రపుంగవులెల్ల దీవెనల నీయ
సతులుఁ దమిఁగప్పురంపుహారతుల నిడఁగ
మనుజనాయకుఁ డాస్థానమంటపంబు
సొచ్చి భద్రాసనం బెక్కె సురలు పొగడ.

వ॥ అంత హరిశ్చంద్రుండు తన్ను దర్శింపవచ్చిన పౌరజానపద బృందంబు నాదరించి తత్తద్గేహంబుల కనిపి సుయజ్ఞనాజ్ఞఁ గాశికానాథాదిహితులతో మృష్టాన్నంబుఁ గుడిచి పరిచారికాకృతోపచారంబుల నొందుచుఁ బిమ్మట శయనాగారంబుఁ జొచ్చి నిద్రించె తక్కుంగలవారు సుయజ్ఞునిచేఁ జూపంబడినశయ్యాతలంబుల నధిష్ఠించిరి పిమ్మట.

సీ॥ వృక్షంబు లెక్కి కోసెలలుఁగూయఁ దొడంగెఁ
గొక్కొరకోయనికోళ్ళు గూసె
చిమ్మచీఁకటులెల్లఁ జెదరి మాయములయ్యెఁ
దొంగలజేని వెలుంగుదొలఁగిపోయె
నాకసంబున రిక్కమూక లూడంబాఱెఁ
దుమ్మెద ల్సరసీరుహమ్ములంజొఁ
జేక్కవల్మితి లేని మక్కునంబుల మీఱె
వేవెల్గు వెలుఁగుల విస్తరిల్లెఁ

గీ॥ గాపువాండ్రెల్లఁ బొలములకడకుఁ బోయి
తోలుకొని వచ్చుచుండిరాప్రోలిపసుల

లోకమంతయు నానందలోకమయ్యె
నలరుప్రత్యూషసమయంబునందు నవని.

వ॥ అంతవందిమాగధబృందాభినందనారావంబులు మంగళతూర్య ధ్వానంబు లుప్పతిల్ల హరిశ్చంద్రసార్వభౌముండు మేల్కాంచి కాల్యకృత్యంబులం దీర్చికొని హెగ్గడికాండ్రు వింజామరలువైవఁ గొల్వుకూటంబునకేతెంచి యంతకుమున్న యటకరుదెంచిన సుయజ్ఞుండు తన్నుం గాంచి ప్రత్యుత్థానంబుసేయ వాని నుచితాసనంబున నాసీనుం జేసి సామ్రాజ్యవైభవసూచకంబగు భద్రాసనంబునఁ దా నాసీనుండై తన్నుశ్లాఘించుసత్యకీర్తిం గూర్చుండనియమించి కౌశికుండు వ్రాసియిచ్చినకమ్మ సుయజ్ఞునిమ్రోలం బెట్టింప నాతండు సమస్తాదాయవ్యయంబులతో రాజ్యసర్వస్వంబు నొప్పగించి గురుసేవార్థం బరుగఁదలఁచు సుయజ్ఞుం బూజించి స్వామీ! నాయింటఁ గొన్నిదినంబులుండి నన్నుం గృతార్థుం జేయుండని నిలువరించె. అంత నగరిపరిచారకులు మున్నుగువారు తేనిచెంతకరుదెంచి సాష్టాంగప్రణామంబు లాచరించి యిట్లు విన్నవింపం దొడంగిరి.

గీ॥ పతులఁ బాసినసతులకై నడిని జనని
లేనిసుతులట్లు మది జాలిలేనివీని
బారిఁ బడి యీగరాసట్టిబాములంది
వేగుమామాటఁ జెప్ప నావిధికిఁ దరమె?

సీ॥ చొప్పెఱుంగక భూమిసురుఁ డీతఁడే యెడ
వఱలుదేనము హాత్సనములకనుచు

ధరణీసురాళిసంతర్పణంబుల కంచుఁ
జెలఁగి యజ్ఞాదికర్మల కటంచు
నకట రావించి వెట్టికిఁ బట్టి మోయించి
నట్టిభారంబుల నలయ మోసి
మోసి మామూపులు మోటుకాయలు గాసె
నీవె వీక్షింపు డేమిట్టియిడుమ

గీ॥ లఁ దలఁగంగ నెపుడుఁ జెల్వాలవెదజెల్లు
మీచుకడగంటిచూపులు మిగుల మాప
యిం బొలయ నేటికిం గంటిమంబుజాక్ష !
సద్గుణకలాప ! శ్రీహరిశ్చంద్రభూప !

చ॥ అని తమయిక్కటుల్ దెలియనాడెడు పౌరులవిన్నపంబులన్
విని మదిఁ బేర్మి మీఱఁ బ్రభవించినసుస్మితభాసితాస్యుఁడై
చనవున నీమహామహునిశాసనమున్ శిరసావహించుచుం
బనుల నొనర్చి కాంచితిరి పౌరవరేణ్యకులార ! కీర్తిన్.

చ॥ అది సుకృతంబునం గలుగునావిషయం బిటఁజెప్ప కింక నె
య్యది యెటులైననేకమతులై ప్రముదంబున నిండ్ల కేగుఁడా
చెదఁగరుణించి వారలకు నెన్నియొ కానుకలిచ్చి పంప నా
సదయులు వానిశాంతికినిసంతసమొందుచు నేగిరిండ్లకున్.

ఉ॥ అంతట నాథరాధివిభుఁడంబుజనేత్రుననుగ్రహంబునన్
జింతలనెల్ల వీడి పనిసేయఁగఁ జక్రము; సర్వమేదినీ
కాంతకిరీటరత్నరుచికాండవిరాజిత పాదపద్ముఁడై
యెంతయు సంతసంబున మహీతలమేలుచునుండె సత్కృపన్.

ఆశ్వాసాంతము.

ఉ॥ అంబురుహాక్ష! దీనమనుజావళిరక్షణబద్ధకంకణా!
తుంబురనారదాదిముని ధూర్జటిదేవధవాదిసేవ్యపా
దాంబుజ! భక్తవత్సల! మహాకరుణారసపూర్ణచిత్త! క్షీ
రాంబుధికన్యకామలహృదబ్జదివాకర! సద్గుణాకరా!

మాలిని॥ సరససుగుణమూర్తీ సత్యమార్గానువర్తీ
పరమపదవిహారా భక్తచింతాపహారా
సరసిజదళనేత్రా చారుకారుణ్యపాత్రా
కరపతిపరిపాలా క్ష్మాసుతారత్నలోలా.

భుజంగప్రయాతము॥ బుధారాధ్యశీలా ప్రభూతాఘజాలా
సుధాభానుకీర్తీ విశుద్ధానువర్తీ
కథాసుప్రధానా సుకాంతాభిధానా
ప్రధానాసురారీ సుపర్ణాధిచారీ.

గద్యము.

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షసమాదితచతుర్విధకవిత్వ
చాతుర్యశతావధాన్యుభయభాషాప్రవీణేత్యాదిబిరుదాం
కిత రత్నాకరవంశపయః పారావారరాకాసుధాకర
వైఖానసకులతిలకరంగాచార్యపుత్రరాజమాంబా
వధూటికాగర్భశుక్తిముక్తాఫలానంతాచార్య
కవిప్రణీతంబగు నుత్తరహరిశ్చంద్రకావ్యం
బునం బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ర స్తు.
శ్రీరామాయ నమః
శ్రీ స ర స్వ త్యై న మః

ఉ త్త ర

# హరిశ్చంద్ర కావ్యము.

## ద్వితీయాశ్వాసము.

శ్రీ క్షితితనయాపీవర
వక్షోజకురంగనాభిపంకాధిలస
ద్వక్షస్స్థల ! విజితాఖిల
రాక్షసకుల ! భువనపాల ! రామనృపాలా !

వ॥ అవధరింపుము. హరిశ్చంద్రసార్వభౌముం డిట్లు విధంబుగ ధర్మంబు చతుష్పాదంబులఁ బ్రవర్తింపఁ గన్నబిడ్డలంబోలెఁ బ్రజలఁ గాపాడుచు రాజ్యంబుసేయుసమయంబున.

గీ॥ ఉత్సుకము మీఱ మనములో నొక్కనాఁడు
నపరపరమేష్ఠియనఁ దగు నవ్వసిష్ఠుఁ
డానృపశ్రేష్ఠుఁ గానరా నవ్వరిష్ఠు
దవ్వులం గాంచి గద్దె సత్వరమున డిగి.

సీ॥ ఎదురేగి కడుభక్తి గదురఁ బూజలొనర్చి
చెలఁగుసింహాసనాసీనుఁ జేసి
తత్పదాబ్జంబు లాత్మవదనాబ్జము సోక
మ్రొక్కి తా నయభయంబులు దలిర్ప
నల్లన గురువరేణ్యా ! కుశలంబె యటంచు
నడుగ నవ్వాసీంద్రుఁడతిముదమున
నాశీర్వదించి నీయట్టిశిష్యుండుండ
ధరణిమాబోంట్లకుం గొఱంత గలదె

గీ॥ సత్యపాలనమున మహా స్థైర్యమూని
కౌశికునిమెప్పుఁ గాంచినఘనుఁడ వగుచు
నాదుశపథంబు తీర్చితివో దయాత్మ !
నిన్నుఁ బోలినసృపుఁ డొక్కఁడున్నె ? యెందు.

సీ॥ ఏధన్యతముఁడవై యొసఁగితి నాతపం
బులు ఫలించె సమస్తభువనమాన్యుఁ
డగువాని మెప్పు నొందగ నసామాన్యమా
సదమలాశాంతవిశ్రాంతకీర్తి
వంతుండవై నీవు వఱలుట కమ్మౌని
కాంతుదీక్షయె మూలకందమయ్యె
నని వచించుగురూత్తముని పల్కు లతివిన
యమున నాలించి మీరానతిచ్చి

గీ॥ నట్లు గాధిసుతుండు నాకవని నేడు
గడయుననుమాట నిక్కంబు ; కానవాని

కరుణఁ దమదీవెనల వాసిఁగాంచియుంటి
ఘనతరమనోజ్ఞ గుణగణ్యా ! మునివరేణ్యా !

వ॥ అంతలో నాతనిరాజ్యలక్ష్మియో యనం జంద్రమతిత్వరితగతిం జనుదెంచి గురువరేణ్యులపాదారవిందంబుల కెరగి నిత్యసత్య వ్రతదీక్షావిచక్షణుండగు హరిశ్చంద్రుని పృష్ఠభాగంబున కరు దెంచి యొదిగి నిలువంబడియె నంత నరుంధతీకాంతుండాసతీ మణిం బ్రాజ్ఞుండగు సుయజ్ఞునకుం జూపి యిట్లనియె.

సీ॥ ఈసతీమణి తాల్మినెసఁగుట ధర్మజ్ఞ
పరులఁ దూలించె దేవతలు వొగడ
దీనిపాతివ్రత్యమూని శ్లాఘింపంగ
జలజాసనున కైన నలవియగునె?
యిట్టిపాతివ్రత్యమే కదా పీనినోం
దినయూపదంభోనిధికినిఁ దరణి
యై దరిఁజేర్చె నా నాసుయజ్ఞుఁడు పీర
లిట్టువంటిమహిమచే నెసఁగుటకును

గీ॥ లలితభవదీయపాదావలంబనంబె
మూలమై యొప్పె మీపదాంభోజయుగ్మ
పరమసేవాతరణి నిరంతరము గాధి
సుతునిమాయాబ్ధి దాటించుచుండు గావె.

వ॥ ఐన నదియట్లుండనిండు.ఈసతీమణికంఠంబున నలరారుమంగ ళసూత్రంబు ప్రాణేశ్వరునకుం దక్క నన్యులకుం గానరా మికింగారణంబేమి?చక్రవర్తింజేపట్టినయీరమణేలలామంబుఁ

గాలకౌశికుండు దాసిగాఁ గొననేల ? నరేంద్రదర్శనంబునం గొందులరయువాయుభక్షకుండగు తక్షకుం డీనరేంద్రనంద నుం గఱువనేల ? యనినామనంబు శంకాకులితంబైయున్న యది. కావుననాసందియంబులందొలంగించిమన్నింపుడనవుడు వాని ప్రజ్ఞావిశేషంబునకు మెచ్చి వసిష్ఠుండు వానికిట్లనియె.

చంద్రమతీచరిత్రము

సీ॥ ఈభూమిఁ గల్మిచే నెసఁగుజ్యోతిష్మంతు
డనుపార్థివుఁ డొకండుదనరుచుండె
నాతండు నిహతసర్వారిజాలుండౌచుఁ
బాకశాసనువైభవముల రాజ్య
మేలుచుండినఁ గాని యీప్సితంబులఁదీర్చు
నట్టిపుత్రుఁడు లేమికంతరంగ
మధికచింతల నొంద నాశ్రితావనపరా
యణుని నారాయణు నాత్మలోన

గీ॥ నిలిపి తపమాచరించి యాజలజనేత్రు
కరుణఁ గల్యాణగుణపరంపరలకెల్ల
నిలయయగుపుత్రిఁగని వేడ్కనలరుచుండెఁ
దనదుపాలిటిలక్ష్మియోయనుచు నెపుడు.

సీ॥ అది కల్మిచెలియయ్యునాత్మజనకు భంగ
సంగతుం జేసినసరసిజాల
యొ, సుధాంశుననుంగుటువిదయయ్యునుఁ జెన్న
మున లేనిబన్న మొందినజనకునిఁ

గన్నడసేయ జెంకని రోహిణియొ, సుగు
ణాళిరత్నాకరయయ్యు వజ్ర
ధారాహతి నణంగుతాడ్రిని నరయజో
లనిపార్వతియొ, విద్యలనిధియయ్యు

గీ॥ నెపుడు నిలలోనఁ దాఁ బుట్టినింటిపేరు
లేకమనువాణియో యనులీలఁ బుట్టి
నింటికిం జెట్టయై వాలుగంటి సుష్ట
లగ్నమునఁ బుట్టి కల్మిలీలలఁ జేదువుల.

। తల్లిదండ్రులకు ముదంబుఁ దలకొల్పుచు బెరిమం బెరుగు చుండె. ఇట్లాకాంతామణి దినదినప్రవర్ధమానయై పది యాఱవయేట నతికఠినంబై జననీజనకులకు నాశనహేతు వగుదుర్ముహూర్తంబున సమర్తాడెను. అయ్యెడ నారాజేం ద్రుండు కార్తాంతికుల రావించి తనకుమారి ఋతుమతియైన లగ్నఫలంబు విచారించి తెల్పుఁడన వారలు తిథివారనక్షత్ర యోగకరణంబుల నారసి రాజేంద్రా! తమపుత్త్రికా రత్నంబు జన్మించినలగ్నంబు కడుంజెడ్డది. అది తెలిసియుం దమకుం జెప్పవెఱచితిమి. నాటంగోలెఁ బాటిల్లు నిడుమ లెన్నేనిం గలవు. అవి యిప్పుడెన్న నేల? అంతకంటె నిపుడు సమర్తాడినలగ్నంబు కడుం గీడై కనుపట్టె ననివిన్నవించిరి. పిమ్మట.

॥ అంతట నానృపుండు తెలుపాఱుమొగ్గసశిరంబువాంచి ని న్నెంతయొ నాదులక్ష్మివని నెంచితి నమ్మరో! యద్దిగన్నుగా

నింతటిమాట నేఁడొదవె నింక నొనర్చునదేమి యంచుఁ దా
స్వాంతమునందుఁ జింతవడిస్మారకహీనుఁడనన్ మహింబడెన్.

ఉ॥ ఆసురవస్థఁ గాంచి యటనాప్తజనంబులు గ్రమ్మి భీతి నా
చ్ఛాదితచిత్తులై సముపచారములం బచరించి చేతనా
పాదితుఁ జేసి రంత నలపార్థివుఁడెంతయుఁదాల్మిఁబూని యీ
మాదిరిఁ జిచ్చునార్పఁగలమార్గ మదెద్దియటంచుఁ జింతిలెన్.

వ॥ ఇవ్విధంబునఁ జింతిల్లుచుఁ గొంతవడికి ధైర్యంబవలంబించిమంత్రులంజూచి యమాత్యులార! మీరు నాదగుహానివృద్ధులకు బాధ్యులరు. మీమంత్రక్రమంబునం బ్రవర్తించుట మాకుం గర్తవ్యంబు. కావున దీనికిం దగునుపాయం బెఱింగింపుడు నావుడు మంత్రిపుంగవులు వానిం జూచి.

చ॥ పుడమి నరేంద్ర! యీకలికిపుట్టినదాదిగఁ గల్గె నెన్నియో
యిడుములు; వానినెన్నదరమే? యిఁకజ్యోస్యులమాటబొంకు
గా, నుడువఁగరాదు కావున మనోరథము ల్సమకూఱునీసుత
న్విడుచుట మేలటంచుఁగడువేడుకఁబల్కిరి కొందఱందునన్.

సీ॥ తొలఁగింపకున్న నీ చెలువకొక్కరితకై
సర్వనాశస్వనాశములకు నోడఁ
బడవచ్చునే? యంచుఁ బల్కువారును; స్వప్న
సాముద్రికశకున జ్యౌతిషములు
సరిచూచినట్లుండుసరిచూడకుండవి
యొకప్రమాణములంచు నువిద విడుచు

టనుచితంబ యటంచునను వారుఁ దగుదగ,
దని విచారింపక యతిశయమున

గీ॥ నొకటిగావించి కడు నుమ్మలికముతోడఁ
గలఁగుటం కంటె దూరదర్శులనుబిలిచి
వారితోడ విచారించిపైన నొక్క
పనికిఁ దెగుటయె తగననిపల్కువారు.

వ॥ ఇట్లు పరిపరివిధంబులం బల్కు ప్రధానులవ్యర్థాలాపంబులు వారించి తగవువిచారించి నయవిశారదుం డగువిశారదుం డనుప్రధానామాత్యుఁ డానృపాలున కిట్లనియె.

చ॥ అనృతములంచుశాస్త్రములనాడగవచ్చునే?ధర్మసూక్ష్మముల్
గనుటకు నేరికిం దరమె? కావునఁ గన్నకుమారి యంచుహా
నిని నిటులన్ ఘటించు ననునిందలఁ బొందినదానిఁగావరా
దనవరతంబు స్త్రీవధ లనర్థములంచు వచింత్రు ధార్మికుల్.

వ. నరేంద్రా! యెద్దియేని నొకయుపాయంబునఁ బరిహరించుట యుక్తంబగు. మీముద్దులపట్టిం బరిత్యజింతుమేని దానిం జెందిననింద లణంగుదాన మననెంజిలియుం దొలఁగు. దైవా నుగ్రహంబున నది మేలొందిన నొందునని హితంబును పాపరహితంబునుగా నుపదేశించు ప్రధానామాత్యువచ నంబులాలించి పైకొనుదుఃఖం బడంచుకొని ఋతుస్నాత యగునంతకు దానినొక్కరహస్యమందిరంబున నుంచి పరిత్య జింప నుంకించి యాజాడ దానికెఱుకపడనీక స్నానం బొన ర్చినదినంబున నర్ధరాత్రంబున మైమఱచి నిద్రించుసమ్ముద్రస్థల

గుమ్మనించుకేనియుం గొంకక యొక్కమండసంబున భద్రం
బుగా నుంచి తాళంబు వైచినగరప్రాంతంబునం బ్రవహించు
నొక్కమహాతరంగిణిం బడవైపించె నంత.

సీ॥ ఆప్పెట్టె పార్శ్వద్వయంబులఁ గనుపట్టు
గట్టులం దొట్టిపై దట్టునుదక
ములఁ బుట్టి మిడియుపీచులును; పీచులవెంటఁ
బెరుగుచుం బేరిన నురుగుతెట్టె
లును; వాని లోఁ గొని, దనరారగుడుగుడు
గుంచంబులాడునె క్కొనెడిసుడులు
సుడులవెంటఁ బడి వెడలనేరక త్రొట్రు
వడునట్టి జలచరవ్రాతములును
గీ॥ గలిగి తరిఁగొని తరియింపనలనుపడని
యానదీపూరమునఁ బడియటులనిటులఁ
బొరలి క్రిందమీఁదుగఁ దేలిపోవఁబోవ
మేలుకొని యందు నిదురించుమించుబోఁడి.

ఉ॥ లేవను గూర్చొనన్ వలనులేదనియేడ్చుచుఁదన్నుఁగూర్చిసం
భావన సేయ నట్టితనవారలమాటలు విన్నదౌటచే
నీవిధి వారె కాదనక యీనదిలోఁ బడఁద్రోసియుందు రిం
కేవిధి దీనినిం గడతునేదియుపాయము దీనరక్షకా.

చ॥ అని యిటులూహసేసిపదినక్కట! మాజనకుండుజ్యోస్యులా
డినవచనంబు నమ్మి వెకటింపు జనింపఁగ నీమహానదిన్

ననుఁ బడఁద్రోయఁ జేసె నిదినామపురాకృతకర్మ మైన నా
వనరుహాజుండు నెన్నొసట వ్రాసినవ్రాతలు దాటశక్యమే.

సీ॥ ఇదికానిచో నాకునీపెట్టియం బడి
యిట్లుకొట్టుకలాడ నేల ! తండ్రి !
నన్ను నివ్విధమునఁ బన్న మొందించుట
కంటె నీచేతిఖడ్గమున శిరము
దెగఁ గొట్టలేకపోతివె? జోస్యులార ! నే
డన్నమాటయె నాఁడుచిన్ననాఁడె
యని పుణ్యముం గట్టికొనలేకపోతిరె ?
మీ రెట్టులున్న నామీఁదఁ గన్న

గీ॥ వారి కింతటి నిర్దయాభావ మమరె
నన్య లెవ్వరు నన్నింక నాదరింత్రు
నన్ను నీరీతి నిడుమలనవయఁ జేసి
యరయనీ డెంద మెట్లోర్చె నమ్మ తల్లి !

సీ॥ అక్కటా జలచరాహారణపరాయణం
బులగునీజలపక్షికలకలములు
తగునైదువులపాటలుగ, నీటితరగల
ధ్వానంబు లలమేళతాళములుగ
గగనంబు నొరసి వేగమునఁ బాఱెడువెల్లిఁ
బడి యూగులాడునీపసిఁడిపెట్టె
యుయ్యాలతొట్టిగా నొదవుసమర్థవే
షకఁ గంటి నిట్లుంచు మొకము వాంచి

గీ॥ కూర్మిఁ దనవారిఁ బేర్కొనికుందుచున్వ
చారమతితోడ నోసూర్యచంద్రులార !
యార్యవర్జితనగునన్నుఁ బ్రాణవర్జి
తనుగఁ జేయరె మీరైన దయఁ జెలంగి.

సీ॥ ఓదిగీశ్వరులార ! యేదిక్కుగానక
చిక్కులం బడి యిట్లు స్రుక్కుచుండు
నామొర యాలింపరే మహాబుధులార !
యీజలంబులఁ బడి యిట్లు కుందు
నాకష్టముడుపరే నీకు మ్రొక్కెద నోన
దీమతల్లిరో చల్లనై మెలంగు
నీలోనఁ జొచ్చి కష్టాలపాల్పడినట్టి
నన్నుఁ గాపాడిఁ పుణ్యంబుఁగొనవె

గీ॥ యనుచు నిట్లెన్నువలుపెట్టుచును సమస్త
దిక్పతులు మాఱుమ్రోయఁగా దిగులు సెంది
తుదకుఁ గర్తవ్యమేమియు దోపకున్న
కారణంబున శోకింపఁగాఁ దొడంగె.

వ॥ ఇవ్విధంబున నామందసంబు ప్రవాహంబునం బడి పెక్కు దేశంబు లతిక్రమించి పోవఁ దన్నదీప్రాంతంబునం గల యొక్కపుణ్యాశ్రమంబునఁ దపంబుసేయుచున్నమయుండను మునీంద్రుం డాయార్తనినాదం బాలించి తపంబు చాలించి యట కరుదెంచి శిష్యులం బంచి వెల్లివెంట బోవునా మందసంబుఁ జేరునకుం దెప్పించి తాళంబులు దీయించి

యందుబంగారుబొమ్మయో యనవిరాజిల్లునక్కాంతాలలా
మం గిలకించి యిట్లు దలంచె.

సీ॥ ఇది దేవతల వీడి యిలలోన మానవ
వనితలతో నుండవచ్చినట్టి
యచ్చరకన్నెయో, యచ్చంపుబంటుల
నిప్పచ్చరంబునఁగప్పి మదను
జనకు వంచించి యీయాత్మతలంబునఁ జరిం
పఁగ వచ్చినట్టియాపాలకడలి
బిడ్డయో, జలధిసంప్రేషితయై యింక
నొంసరంగ దిరుగవచ్చినజలాధి

గీ॥ దేవతయొ, యగుఁ గాకున్న నీవిలాస
మీయొయారంబు సౌభాగ్యమేవిలాసి
నులకునైనను భూమిలోఁగలదె చూడ
దీని వర్ణింప నలనల్వకైనఁ దరమె ?

చ॥ అనితలపోయుచుండఁగ రయంబుననాయమసూత్రధారుఁడౌ
య్యనఁదెఱదీయరంగమునకాడుచుఁబాడుచువచ్చుబొమ్మయో
యన నటనుండి వెల్వడి భయంబున మేనువడంకుచుంచ లో
చనముల నీరు జాఱ మునిచంద్రునకయ్యెడమ్రొక్కినిల్చెసః.

వ॥ అంత నమ్మునీంద్రుండు "దీర్ఘసుమంగలీభవ" యనిదీవెనలొ
సంగె. ఆదీవెనలంది మహాత్మా ! యయ్యది నాకెట్లు లభిం
చునని యామె వానితో నిట్లనియె.

సీ॥ కడఁదిలగ్నంబునఁ బుడమిలో జన్మించి
పుట్టినింటికిఁ బెద్దచెట్టనైతి
నంతకంటెఁ గడిందియగుమహార్తమున స
మర్తాడి యిటుల నీయార్తిఁ గంటి
నని యాత్మవృత్తాంతమంతయుం దెల్పి దై
వకృతంబు నిందించి వానియెదుట
వాపోవ నాతఁడావార్త నాలించి నీ
వున్మలింపకు మింకఁదమ్మికంటి !

గీ॥ జ్యోస్యులాడినయది సత్యసూక్తియైన
నేనిడిన దీవెనల నద్ది మానఁగలదు
నిన్ను మాంగల్యములు వొందునిక్కువముగ
విశ్వసింపుము నామాట వేడ్కతోడ.

సీ॥ నీవు చంద్రోపమనిర్మలకీర్తియుం
జక్రవర్తియు నగుపుణ్యాత్మలేశ
చంద్రున కింతివై చంద్రమత్యాఖ్యచే
నధికసౌభాగ్యభాగ్యముల నెపుడు
వర్తిల్లఁ గలవు నీవర్తనంబు జగత్ప్రి
పూజ్యమై యొప్పు నీపుట్టుకనుండి
కలిగినయట్టికీడులకెల్ల ముఖ్యచి
హ్నంబుగా నీకంఠమందుఁ గలుగు

గీ॥ నట్టిమాంగల్య మరయ నీయనుఁగుచెలువ
నకును దక్క మఱింక నేరికినిఁ గాన

రాకయుండు నటంచనివీక నుడివి
ప్రముదమున నొక్క హేమసౌధము ఘటించి.

ఉ॥ ఆకమలాస్య నందునిచియర్మిలిఁ గోరినవస్తునాహనా
నీకముతోడఁ గార్యముల నేర్పునఁ గూర్చుపయోజలోచనా
స్తోకశతంబుఁ గూర్చి సురసుందరులం బురుడించునామె నెం
తో కరుణాత్మఁ బెంచుకొనుచుం డెమయుండుతపోధనుండిలన్.

వ॥ ఇవ్విధంబున నాలలనాశిరోమణి మయమునీంద్రుకరుణా
కటాక్షంబునఁ దనడెందంబునం గలకుందు డిందుపఱచి
సుఖంబుగఁ గాలంబు గడుపుచుండె. అంత జగంబునం గల
నిఖిలజంతువుల కానందదాయకంబై వసంతకాలంబు సం
ప్రాప్తంబయ్యె.

చ॥ అతిముద మొంది చంద్రమతియాసమయంబునఁ దా సఖీజన
ప్రతతులఁ గూడి పంచశరుబాణములో యనునట్లు తద్వన
క్షితి విహరింపఁబూనితగుచెన్నువహించుచుఁదేనెగ్రోలి కూ
జితములసల్పు తేటిగుమిచే నలరారు నికుంజభూములన్.

సీ॥ విహరింపఁ బూని క్రొవ్విరిబోడులం జీరి
విమలనూతనపల్లవముల మెక్కి
రవళిఁ గొల్పుపికాళిరావంబులకు మాఱు
రావంబు లిడుచు గర్వమున నెపుడు
విరులఁ జైత్రునిసైన్యవితతులలో యనఁగ ఝుం
కారతర్జనములుమీఱఁ దిరుగు

తేంట్లఁదోలుచుఁ బువ్వుదేనెల న్నిగులఁగ్రో
లుచుఁ బువ్వుటిండ్ల దూఱుచు మహీజ
గీ॥ విసరశాఖాగ్రములఁ జేరి కుసుమతతుల
నేలరాలగ నూఁపుచు నోలి బెదరి
పఱచుచిల్కలఁ బిలుచుచువఱలుకృతక
శైలముల నెక్కి తిరుగుచుసరసఫణతి.

ఉ. పిమ్మటఁ దా సఖీజనుల వెల్వడి పువ్వులఁగోయఁబూనిపూఁ
గొమ్మల డాసియొండొరులఁగూరిమిఁ బిల్చుతఱిఁ దలంచివృ
క్షమ్ముల నున్న కోయిలలుజాతిఖగం బులె యంచుమాఱుశ
బ్దమ్ము లొనర్ప మాటలొ రవంబులొ లోకమెఱుంగశక్యమే.

సీ॥ ఒకవంక నకలంకశుకశంకరనిరంకు
శకలనిక్వాణము ల్సంఘటిల్ల
నొకదండఁ గుజముండితకరండపరిమండ
లమధులిట్కోలాహలంబు లమర
నొకచెక్కిఁ దరువెక్కియొకసక్కియము గ్రిక్కి
రవళించుపికపాళిరవము లఱర
నొకతట్టు నంబట్టులకు జెట్టు గనుపట్టు
కరణిఁ గేకికలనిక్వణము లుబ్బ
గీ॥ నొక్కచోటమహీజాటనోత్సవయుత
శారికావారమధురనిస్స్వనము లెసఁగ
మంతనము మీఱఁ గందర్పమహీధవునకుఁ
దోడుపడెననఁ నవ్వసంతుండు వచ్చె.

వ. ఇట్లువ్వసంతంబునఁ గాంతామతల్లులు పుష్పాపచయం
బొనర్చి విహారశ్రమవాపుకొన జలకేళీలాలసలై పరిధాన
పరిష్కారంబు లూడ్చి చిఱుపావడలు ధరించి క్రమంబున
మత్తకరిణులభాతి నవ్వనంబున విలసిల్లు సరోవరంబునం
బ్రవేశించిరి. పిమ్మట.

సీ॥ ఒకదానిపైన వేఱొకతె నీళ్లం జల్ల
వేఱొక్కపొలతిఁ యావింతఁ జూచి
చిఱుతదానినిఁ బట్టి వెలిపించుటొకపాఁడి
కాదు నీవింక నామీఁదికట్లు
రమ్మంచుఁ బలికి యారమణి గొంతుకబట్టి
నీళ్లలోపల ముంచి నీవు చిఱుత
వాంఢ్రపైఁ బోకుందువా బుద్ధివచ్చిన
దా యంచుఁ గలఁప నాతోయజాక్షి
గీ॥ చెక్కుచెదరక యారీతి నిక్కినిలిచి
చల్లుపోరాడుపోడిమి చెల్లె నీకుఁ
గాని మఱియెవ్వరికిఁ జేతఁగాదు కాన
నన్ను వదలుమటంచు నానాతివేఁడె.

సీ॥ నిర్మలాస్యములై కాన్పింప నీద సరోవ
రము పూర్ణచంద్రబింబమయ మయ్యె
బాహుదండములై చూపట్ట నీద సరోవ
రము మనోహరమృణాళమయ మయ్యెఁ

కుచములై చూపట్టఁగోరి యీాదసరోవ
రము విలాసంపుచక్రమయ మయ్యెఁ
దఁఱుములై చూపట్టఁదోఁగి యీాదఁ సరోవ
రము సటన్మాత్స్వకరమయ మయ్యెఁ

గీ॥ బాదయుగళమె కాన్పింప నీద నాజ
లాశయంబెల్ల రక్తోత్పలమయ మయ్యె
సొగసుమేనులె చూపట్ట నగుచు నీదఁ,
గమలజాకరమెల్ల హేమమయ మయ్యె.

సీ॥ మెలఁతలమురిపెంపుమీాగాళ్ల చే నటఁ
గూర్మాళి కొకవింతకులుకు లమరెఁ
జెలులచెక్కనిపెందొడలచే నచట నీటి
యేనుగుల కొకవింత హేల లమరె
లలనామణివళిద్యుతులచే నచటఁదరం
గశ్రేణి కొకవింతకలలు గలిగె
చెలియలనాభిలీలలచే నచట జలా
వర్తాళి కొకవింతవగలు గలిగె

గీ॥ నంబుజాక్షులవక్షోరుహములరుచుల
చే నచటఁ జారుకోరకశ్రేణి కొక్క
వింతకాంతులు చెలరేగె సంతసమున
మించి జలకేళి వగలఁ గావించునపుడు.

వ. ఇవ్విధంబున నాపుర్వబోంఢ్లు జలకేళిం గావించి తనిసి యొం
డొరులం గలిసికొనికమలాకరంబు వెల్వడి సముచితాంబరా

భరణాలంకృతలై యట నొక్కరసాలసాలనిబిడచ్ఛాయ
బడలికలు వాయ విశ్రమించిరి.

సీ॥ అపుడొక్కభూమిపాలాత్మజుండు మహోగ్ర
శరచాపధరుఁడు సైన్యరహితుండు
సముచితారోహితాజానేయుఁడును స్వేద
జలపూరితాంగుఁ డచ్చటికివచ్చి
హయము డిగ్గి సరోవరామలోదకములు
దప్పి దీఱఁగఁ గ్రోలి తాఁ బధిశ్ర
మంబు మెల్లఁగ వీచుమలయానిలంబుచేఁ
దీర్ప నెంచుచు నొక్కదివ్యకుసుమ

గీ॥ పల్లవగుళుచ్ఛపాళిసంఫుల్లకుంజ
మందిరముఁ జేరి యటఁ మహానంద మొదవఁ
గొంతవడి విశ్రమించి యచ్చెంత నున్న
కొలఁకుదరి నొక్కమురిపెంపు వెలఁది గాంచి.

చ. ఇది మయునాశ్రమం బిచట నెన్నఁడు నిట్టిలతాంగిఁ జూడలే
దిదికమలాలయో, రతియొ, యింద్రునిభామినియో, భవానియో
మది కిటదీనిచందమనుమానముఁగొల్పుచునుండె నంచుఁ ద
ద్వదనమునల్లికాంచుచున్నృపాలుఁడు దాఁదలపోయుచుండెడిన్.

ఉ. పిమ్మట నాలతాంగి పృథివీపతి నట్టులె చూచి లేచి తాఁ
గొమ్మలచాటునం దాఁగికులుక్కుమిటారి నొకర్తుఁ జీరి నీ
వమ్మహిపాలచంద్రుఁ జెలియా! కనుగొంటివె? యాతఁ డెట్టివం
శమ్మునఁగలాఁడొ యిందులకుఁ జెల్లఁగ వచ్చిన హేతు వేమొకో.

ఉ. ఆతని పేర దేమొ వినయంబున నీవట కేగి మ్రొక్కి సం
ప్రీతి నెఱిఁగి రమ్మనిన, వోటనె యాలలితాంగి పోయి యో
భూతలనాథ ! నీవెవరవో పుర మెద్దియొ నీకు రాకకై
హేతువదేమొ తెల్పుడని యెంతయు వేడఁగ నాతఁ డిట్లనెన్.

గీ॥ తరుణి ! నాయున్కి పట్ట యోధ్యాపురంబు
నేఁ ద్రిశంకునిపుత్త్రుండనిక్కువముగ
చానఁ నాపేరు శ్రీహరిశ్చంద్రుఁడండ్రు
వేటకై వచ్చి యీమహావిపినమునకు.

వ. మార్గవశంబున నిటకేతెంచితి. దాహాతిశయంబున నమృతోపమానంబులగు నీసరోవరజలంబులం గ్రోలి యీసాంద్ర మహీరుహచ్ఛాయం బడలికలు వాయ విశ్రమించితి. అల్ల యావిలాసవతివృత్తాంతం బెఱుంగు దేని నెఱింగింపుమనపుడు నక్కాంతారత్నం బారాంజేంద్రునితో నిట్లనియె.

క॥ ఈలలనారత్నము మా
యేలికసాని యగు; మయమునీశుఁడు కరుణా
లోలాత్ముఁ డగుచుఁ బెనుపఁగ
నీలీలం బెరుగుచుండె నిద్ధచరిత్రా.

క॥ జ్యోతిష్మంతుండనియెడు
భూతలపతిపుత్త్రి యీమె పొల్పారెడునీ
నాతి జనంబులకును సం
ప్రీతిగఁ జంద్రమతియనెడి పేరఁ జెలంగున్.

సీ॥ అని చెప్ప నాతండుహర్షించి యిది మహా
మునికన్యయని లేనిపోనిసంది
యమున జెంకితిఁ గానియట్టిదయేని న
ద్దానిపై నాయాత్మదగులు నెట్టు
లని విచారించి యాావనజాక్షి వీక్షించి
రమణి యెన్మిదివివాహములలోన
గాంధర్వ ముత్తమక్షత్రియులకు నుత్త
మోత్తమంబని పల్కుచుంద్రు బుధులు

గీ॥ కాన గాంధర్వవిధిని నీకమలగంధిఁ
బరిణయంబాడ నామనఃపద్మ మధిక
హర్ష మున నుండె నంచు నాత్మాభిమతము
తేటబడునట్టు లయ్యెడఁదెలియఁ బలికె.

సీ॥ అంతలోన మహావనాంతరంబున నుండి
చెదరిపోయినయట్టిసేన వచ్చి
యలచండభానువంశాంభోధచంద్రునిం
జేరి యుద్యద్ధాటిభేరికాది
వాద్యముల్ మ్రోయింపసరతధ్ధణాంఘణ
నాదంబు లాగిఁ గగన భేదనంబు
లగుచుఁ గాన్పింపఁగాసంహసన్నమునిదార
బృందంబు లాహస్త్రై తాదవఁ గొని

గీ॥ మయునిఁ జేరి దనుగామయ ! మాధ నుం ఁ
బాపవే యాగభీరరావమునస్త్రైన

కారణంబేమి యని నమస్కారముల న
మేయముగఁ జేయ నాతఁడాత్మీయదృష్టి.

సీ॥ ఎఱిఁగి సర్వం బిద్ది యిక్ష్వాకువంశాబ్ధి
చంద్రుండు నౌహరిశ్చంద్రభూమి
పాలునిరాకచేఁ బఱతెంచినట్టిసం
దడి; దీని కిట్లు కొందలము నొందఁ
బని లేదటంచు నవ్వారల నూరార్చి
శిష్యాళితోడ నాక్షితిపతీశుఁ
డున్న చోటికి నేగితన్నుఁ దవ్వులఁ గాంచి
యెదురుగా వచ్చి యోసదయహృదయ

గీ॥ యనుచు వందనములఁ జేయు జనవిభునకు
దీవెనల నిచ్చి సముచితాతిథిసపర్య
గౌరవించి నృపాల! నిన్గాంచుతలఁపు
గలుగునా కద్ది యిట దైవికముగఁ గలిగె.

వ. రాజేంద్రా! నీఁబోటి మేటిభూవల్లభునకు నాతిథ్యం బీఁగంటి నామనంబునం గలసందియంబు చిందరవందరయ్యె. నావుడు నప్పుడమిఱేఁడుతిక్రాలజ్ఞులరగు తమవంటి మునీంద్రులయను గ్రహంబుం బడసిన నజ్ఞుల కేనియుఁ గొఱంతలు వాటిల్ల నేరవన మీాకు సందియంబులున్నె? యుష్మదవ్యాజకరుణా రసంబునకుం బాత్రుండనై తిం గాన నందుకుం దగినఫలంబుఁ గాంతుననివిన్నవించి నమస్కరించి చంద్రమతియుం దఁ దన

కుం గలకోరికఁ జెల్లఁ సత్యకీర్తిం గనుగొలుపుటయు నయ్య
మాత్యవర్యుం డత్తాపసోత్తమున కిట్లనియె.

సీ॥ మౌనీంద్ర! యాలింపుమీ నరేంద్రుఁడు వేట
కొఱకు నివ్వనిఁ జేరి గిరినిఁ బోలు
కిటిని వెన్నంటి తాఁబఱచి దాహముఁ గాంచి
మార్గంబు దప్పి యిమ్మాడ్కి నిటకు
వచ్చి యీపూఁదోఁటఁజొచ్చి యీసరసినిం
దఱిసి యిందలినీళ్ల దగ నడంచి
కొని యీలతాగేహమున విశ్రమించి మీ
వలన మిక్కిలిగౌరవములఁ బొంది

గీ॥ మరల నొండొక్కమేలు మీకరుణవలనఁ
గాంచఁ గోరుచునున్నాఁడుగాన మీకు
వినుట కిష్టంబు గలదేని వేడ్క మీఱ
విన్నవించెదనన మౌనివీరుఁ డపుడు.

ఉ. ఇచ్చట నీతఁ డేమిగొన నెంచునొ! యయ్యది తాఁ గ్రహింపఁగా
వచ్చుననంగ మంత్రి విని వానికి మ్రొక్కి భవద్వనంబునన్
ముచ్చట లీనుబాల జనమోదిని నొక్కతెఁ గాంచి దాని స
చ్చరితుండుగై కొనెడుసమ్మతిఁ జూపుచునున్నవాఁ డొగిన్.

సీ॥ ఆయింతివృత్తాంతమరయ వీరారిసై
న్యవనదావానలుండగుచుఁ గీర్తి
నందు జ్యోతిష్మంతుఁడనునృపాలునిపుత్త్రి
యనియు మీ పెంపుడుతనయయనియుఁ

చెలియనవ్వేడినని తెలుపంగ నాతప
స్సంపన్నుఁ డెంతేనిసంతసంబు
నంది యాసూర్యాన్వయాబ్ధిచంద్రునకుఁ గ
ళత్రంబుగాఁగ నీలలితమూర్తి

గీ॥ పూర్వజన్మంబునందు నేపుణ్యతరము
లయిననోములు నోచెనోయని తలఁచుచు
మంత్రి ! మీరాజునకు మాకుమారిఁగొనఁగ
నందియంబేలయని లోన సంతసించి.

మ. సకలంబుꣳ మదిలో నెఱింగి స్వతపస్సామర్థ్యమొప్పారఁ జె
ప్పకయేమారిమిఁ బెండ్లికిꣳ వలయుసంభారంబులంగూర్చిమా
నికదంబానతిచే ముహూర్తమపుడేనిర్ణీతిఁ గావించి ధా
త్రికలాపంబును బాచెఁ దద్విధుల నిర్వర్తింప వేగంబునꣳ.

వ॥ అట్టియెడ నాభూపాలానతంసుండు తదాశ్రమసమీపప్రదే
శంబుల నిర్మింపబడినపట్టుగుడారులలోన విశ్రమించియుండె
నంత.

సీ॥ అప్పు డొక్కవెలంది యరుదెంచి మయమహా
ముని త్రిశంకునిపట్టిఁగని పలికిన
వృత్తాంత మాద్యంత మెఱిఁగి వేగాతిశ
యమునఁ దా వచ్చి చంద్రమతిఁ గాంచి
యమ్మరో ! తనదుశిష్యాళితో మీతండ్రి
వచ్చి యామేదినీవరునిఁ గాంచి

మన్నించి నిన్ను నామనుజేశ్వరునకుఁ బ
ట్టపుదేవిఁ గావింపఁగృపఁ దలఁచె
గీ॥ నెల్లి లగ్నంబుఁ జింతిల్లు టెఱిఁగి నీవు
దీని నెఱిఁగింప నీకేగుదెంచితమ్మ
చింత నిఁక వీడి కడు సంతసింపుమమ్మ
యనివచించెడుసఖి నామె యాదరించె.

సీ॥ అంతలో దివసాంతమగుట నాపంకేజ
బాంధవుం డాత్మీయవంశభవుఁడు
నగుహరిశ్చంద్రుఁడుందునలచంద్రమతి నెల్లి
బెండ్లాడుననువార్త ప్రీతిమీఱ
నలరసాతలనివాసుల కెఱింగింపఁదా
నరుదెంచెనోయన నస్తశైల
మున నుండి దిగజాఱె నినుని చేఁ బరిణయో
త్సవమహాభద్రవృత్తాంత మెఱిఁగి
గీ॥ ఘనముదంబున బారులుగట్టివచ్చు
పాపరాజులతలలపై వఱలుపద్మ
రాగమణులకాంతులపోల్కి రమ్యమైన
సాంధ్యరాగంబు చెన్నారసాగె నపుడు.

సీ॥ వరుణునిమేడపై వఱలుసౌవర్ణ శృం
గములనిర్మలమయూఖము లనంగ
సమయావసానాస్తశైలకూటోల్లస
జ్జ్యోతిర్లతామహోద్యుతులనంగ

పశ్చిమాశాంగనాభర్మహర్మ్యపరి
గ్రధితమాణిక్యాంశుగణములనఁగ
యామినీకాంతాభిరామకంఠారుణ
మణిహారరుచికదంబములనంగ

గీ॥ రాత్రిసుందరిఁ జేపట్టరాజువచ్చు
ననుచు సురసుందరీమణులంగముల ధ
రించుకెంబట్టుకోకలమించులనఁగ
నపుడు నాసంజకెంజాయ లమరె మింట.

సీ॥ నిరతంబు నవనిపై నిర్మలాంజనమును
వర్షించునావిష్ణుపద మనంగ
సవరించుకొని మేనిసంకేతముల కేగు
కులటావళికిఁ గూర్మిచెలి యనంగ
యామినీసతి లీలతో మేన ధరియించి
నట్టినల్లనిపట్టుపుట్టమనఁగఁ
బరులవిత్తంబుల హరియించుచోరసం
తతికెల్ల సిద్ధాంజనంబనంగ

గీ॥ ఘనతరాస్తాచలోద్గగ్రికాననమున
మండుసంధ్యాగ్నిజన్యధూమంబనంగ
ధరణిఁ జనియించునావారిధరమనంగ
నంధకారంబు జగమెల్ల నాక్రమించె.

చ॥ స్థిరమతిఁ బూని తా సమయశిల్పకరుం డలరోదసీగృహా
పరితలమందుఁ బన్నిననభంబనునల్లనిమేలుకట్టుపై

కరముగఁ గూర్చినట్టిస్ఫటికంబులనంగ వినిర్మలప్రభల్
మెఱయఁగఁదారకాసమితిమించివెలుంగుచునుండెనయ్యెడన్.

మ. రతినాథుండనుపార్థివేంద్రునకు దిగ్గ్రామామణుల్ కేల స
మ్మతిసూనంబులు లాజలుం గలిపి సేమంబొప్ప శ్రీమంగళా
క్షతలుం జల్లిరనంగ సత్ప్రభలనాకాశంబునం దారకా
తతులున్ రాజిలుచుండె వజ్రములసంతానంబుచందంబునన్.

ఉ॥ అభ్రకటంబునందు నమరాంబుజనేత్రగణంబు ప్రేమతో
విభ్రమలీలఁ గొల్చెనునవీనపుముత్తెము లెండఁబోసెనా
శుభ్రనిభావిలాసములశోభిలుచుండె జనాళిగేయమై
దభ్రపుతారకావితతిధన్యతఁ గాంచి నిరంతరం బిలన్.

గీ॥ గగనభామిని ప్రేమతోఁగట్టుకొన్న
నీలవస్త్రంబుపై మహాలీలమెఱయు
రజతసుమములభంగి తారాగణములు
వెలయుచున్నవి యెనలేనిబెళుకులలర.

చ॥ ఘనతరమోహమూని మయకన్యను గైకొనిరాజు బాంధవ్యా
డనెడునెపంబుతోడ దనుజాధిపు రావణుఁ జేరఁ బోవునో
యని తలపోసి కానుకగ నంతట నాత్రిపశాఖినాథుఁ డా
పినయమృతంపుభాండమునమింట సుధాకరుఁ డొప్పెనిలలన్.

గీ॥ మహదజాండవైనాహికమంటపమున
నొడిజేలసోతపోసినవిధమునట్లు
పండువెన్నెల లెల్లెడఁబర్వి మిగుల
జనులచిత్తంబులకు సంతసంబుఁ గూర్చె.

వ॥ పదంపడి కొంతతడవునకు వేగుజాముగా నొయ్యనొయ్యన జాలమార్గంబులనుండి మందమారుతంబు పొలయుటంజేసి దిక్కులు తెలివొందె. కైరవేందీవరసమవాయంబులు ముకుళీభూతంబులగుటంజేసి సరోరుహావారంబులు వికాసంబునందేరె. చంద్రిమతీకంఠంబునఁ గట్టంబోవుమాంగల్యంబు పిదప నేరికిం గాన్పింపదు గాన నీసమయంబున నెల్లరకుం జూపింప భూసురుండెగనెత్తెనోయనునట్లు కమలబాంధవుం డుదయగిరిశిఖరంబు నలంకరించె.

సీ॥ ప్రాగ్దిగ్విలాసినీఫాలభాగంబున
దీపించుసిందూరతిలక మనఁగ
నలిగి కాలకిరాతుఁడంధకారమృగంబు
వధియింప నెత్తినవజ్రమనఁగ
గగనేందిరాదేవికంఠహారంబున
రహిమించునాయకరత్నమనఁగ
మహితదానవపాళిమట్టువెట్టఁగ జనా
ర్దనుఁడు పట్టినసుదర్శనమనంగఁ

గీ॥ బ్రాగ్వధూమణికర్ణాభరణమనంగ
నమరవిభునింటిలోఁ గెంపుటద్దమనఁగ
సకలజగములు మేల్కాంచిసంతసింప
నుదయగిరి నర్కమండలంబుదయమయ్యె

సీ॥ మయుఁడంతఁదనతపో మహిమచే నయ్యాశ్ర
మము రాజధానిచందమున నాక

సమునంటుకాంచనసౌధావళివిరాజ
మానంబుఁ గావించిమహితశిష్య
సముదయంబుం బంచి జలజాప్తకులముదాప్త
వంశాభరణులౌచువఱలునట్టి
క్షితినాయకుల శిష్యసేవితులగుబ్రహ్మ
సన్నిభబ్రహ్మర్షి సంచయముల

గీ॥ బిల్వనంపించి పిదప నాప్రియవధూవ
రులను కల్యాణకరవేదికల శచీపు
రందరులనంగ మదిని నానంద మొదవఁ
గూరుచుండఁగ నియమించెఁ గూర్మిమీఱ.

మ. చెలఁగెం బిమ్మట విప్రమానినివహాశీర్వాదనాదంబు ల
త్యలఘుప్రౌఢిమఁ జూపురోసతులలాస్యస్వానముల్ గాయకా
వళిసంగీతనినాదముల్ సుశుభకృద్వాద్యధ్వనుల్ వందిసం
కులసంస్తోత్రరవంబులొక్కమొగిదిక్కుల్ మాఱుమ్రోయఁగ నడిచె.

వ. ఇవ్విధంబున నత్యంతవైభవాన్వితంబై చంద్రమతీహరిశ్చం
ద్రులవైవాహికమహోత్సవంబునడచె. అంతట నామ
యుండు కనకాంబరాభరణాదులభక్ష్యభోజ్యచోష్యలేహ్య
పానీయాదుల నిఖిలభూనాయకుల విప్రపుంగవులఁదృప్తులం
జేసి తత్తన్నివాసంబులకనిపి యపరిమితవస్తువాహనాన్వి
తంబులల్లునకుం గూతునకు సరణంబిచ్చి యల్లునిం గని
యిట్లనియె.

సీ॥ అవనీశ ! తొల్లి నేనతితపోమహిమచేఁ
జంద్రహాసమొకండుసలిపి దైత్య
నాథుఁడౌ రావణునకుఁ గూర్మితో నాకు
మారి మండోదరి ధారవోసి
యిచ్చుకాలంబున నిచ్చితి; నీకూతు
నీకొసంగితిఁ గాన నిఖలవైరి
తతివిదారణమహోద్దండమై యొప్పు నీ
చంద్రహాసము నీకొసంగఁగలను

గీ॥ దీనిఁ జేపట్టి చరియింతువేని నిన్ను
శూరుఁడెవ్వాఁడు నెదిరింప నేరఁడనుచు
దీవెనలొసంగి యిడినఁ బార్థివవిభుండు
దానిఁ గైకొనె భక్తిచిత్తమున మ్రొక్కి.

సీ॥ అటుల నామయుని చేనట్టిసాధన మొంది
ప్రియవధూసహితుఁడై పిదపఁ వేగ
మున నయోధ్యకుఁ బంప మునివరేణ్యుండైన
యతనియానతిచేఁ బయనమగుటయుఁ
గన్నవారొల్లనితన్నుమన్ననఁ బెంచి
యైశ్వర్యయుతనుగా నాచరించి
నట్టియాతనిఁ బాసి యరుగనేరక చంద్ర
మతి దీనయై దుఃఖమతి నటింపఁ

గీ॥ దల్లి నీవిట్లు మదినిఁ జింతిల్ల నేల
నీకుఁ గలయిక్కటులు ద్రీరె నిఖలభూమి

నాథుఁడగుహరిశ్చంద్రుండునాథుఁడయ్యె
నధికసౌఖ్యము లేక నందు మమ్మనీవు.

ఉ. సంబర ముప్పతిల్ల జనసన్నుతిఁ గాంచెదు నెల్లరాణివా
సంబులు నీకు నూడిగముసల్పుచునుందురు గాన సర్వసౌ
ఖ్యంబులఁ గాంచుచున్ మదినిఁగల్గినచింతల వీడి నీవు శాం
తంబునలక్ష్మియోాయనవ్రతంబులుసల్పుచునుండుమిమ్మహిన్.

ఉ. అమ్మరో! నాదుదీవెనలనంతట మేలగుఁగాని నీకుఁ గ
ష్టమ్మొకైన నంట దిఁకసత్యము నావచనంబు నమ్ము మీ
విమ్మహి నీపతిం గలిసి యిందిరవోలె వసింపుమమ్మ పెం
దమ్మునకున్ ముదంబిడెదునందనుఁడుద్భవిలున్ స్మరుండనన్.

వ. అని యాశీర్వాదంబులిడి నేనెడపదడప మీపురంబునకు
వచ్చి నీక్షేమంబులారయుచుందునని పలికి చంద్రమతిననిచి
పుచ్చె. అంతట నాయిక్ష్వాకుకులమండనుఁడగుహరిశ్చంద్ర
సార్వభౌముండు సతీసమేతుండై సంజ్ఞామిత్రులవలె, లక్ష్మీ
నారాయణులచందంబున, నుమామహేశ్వరులవైఖరి, రతి
మన్మథులవిధంబున, శచీపురందరులకైవడి, నరుంధతీవసిష్ఠుల
మాడ్కి, రోహిణీచంద్రులనడువున, సీతారాములపోల్కి,
వాణీహిరణ్యగర్భులరీతిఁ బసిండియరదంబునెక్కి చతురంగ
బలంబులు బలసి వెంటరాఁ గదలినిజనగరంబుం జొచ్చి చం
ద్రమతిం గూడి యిష్టోపభోగంబులనుభవించుచు సూనృత
వ్రతపరాయణుండై సామ్రాజ్యంబుఁ బాలించుచుఁ బరా

లంబునకు లోహింతుండనునొక్కకుమారుం గని తదీయ
శైశవక్రీడావినోదంబులఁ గాలంబు పుచ్చుచుండె.

ఉ. అపుడు ధరాతలంబె నిలయంబుగ నుండినమాను లేము స్వ
ర్గపురికి నేగ నందు నమరక్షితినాథుఁడు బొంకులేనిభూ
మిపతులు ధాత్రి నుండిననమేయకృపామతిఁ దెల్పుడన్న నీ
నృపునిగురించి చెప్పితిని నేనువిశాలయథార్థవాదినై.

సీ. దానిఁ బరీక్షింపఁ బూని కౌశికుఁడంతఁ
నాకౌశికునిమోలినామహీశు
బొంకింతునని లేనిబింకాలతోఁ బదం
పడి యంతలంతలాపదలు వాని
కొనరించె ననుచుఁ జెల్పినఁ వసిష్ఠునిపాద
ములకు మ్రొక్కి సుయజ్ఞుఁడెలమిఁగలిగి
తమకటాక్షమునఁ జంద్రమతీచరిత్రంబు
సర్వం బెఱింగితిసార్వభౌముఁ.
గీ॥ డగుహరిశ్చంద్రుఁ డీరీతినవనిలోనఁ
గడకుఁ బడరానియిడుమలఁబడుట కిపుడు
మీరు చెప్పినచంద్రమతీరమణియె
కారణమటంచుఁ దలపోయ నేరనయ్య.

చ. అనవ్రుడరుంధతీవిభుఁడునాతని కిట్లనె; భూమిదేవికిఁ
ఘనతరభూషణంబయి జగంబున వాసి వహించి భర్మహ
ర్మ్యనిచయగోపురాదుల విరాజిలునట్టియవంతినామప
త్తన మొకఁడుండె దేవవనితామణిసంచయవాసయోగ్యమై.

సీ॥ ఆనగరంబుఁ గళానిధింబోలె ధ
నుఃకళానిధియై; మనోజ్ఞమూర్తి
యై మన్మథునిరీతి; నంబుజాక్షునిపోల్కి
నతికృపామయమూర్తియై; సురేశ్వ
రునిమాడ్కి భోగియై; వనజాసనునిచంద
మున సేవ్యరాజహంసనిచయుండు
నై; సఫలీకృతయిత్నుండునై భగీ
రథునిపైఖరి; యక్షరాజుభంగి

గీ॥ బహుధనాఢ్యుండునై; మహాభక్తితోడ
సేవఁజేయుచు శంకరుఁజిత్స్వరూపు
నీలలోహితుఁడను మేదినీవిభుండు
భూమిజనపూజనీయుండు ప్రోచుచుండె.

గీ॥ అతనిమన్ననకర్హుఁడై యఖిలసుగుణ
భరితుఁ డుత్తమశీలుండు పరమకీర్తి
భాసితుఁడయ్యు నట జనభద్రుఁడనెడు
హాలికుం డొక్కరుండు దా నలరుచుండె.

క॥ అతనికిఁ జిరకాలమునకు
సుతుఁ డొక్కరుఁ డుద్భవించె సుభగత్వమునన్
రతినాథు ధిక్కరించుచు
నతఁడుండఁగ వానికపుడు యౌవన మొదవెన్.

క॥ అనురూపరూపతియగు
వనితామణి నొండు దెచ్చి వానికి నాతన్

జనకుండు పెండ్లి గావిం
చెను పౌరులు మదిని వేడ్కచే వినుతింపన్.

వ. అంతట నబ్బాలామణి కలరవంబున గలరవంబులకుఁ గల
వరంబు దలకొల్పుచుఁ గలకంధరాభిఖ్య విఖ్యాతయై పేదకు
దొరకినపెన్నిధిచందంబున నాహాలికబాలకున కిల్లాలై తన
యీడుకాపుబాలికలతో రాట్నసాలం జేరి యేకులువడ
కుచుఁ గాలంబు పుచ్చుచుండె.

సీ॥ అంతట నొక్కనాడాపొలియేలిక
యగునీలలోహితుం డశ్వమెక్కి
యిరువలంకుల వాహినీశ్వరశ్రేణిగొ
ల్వఁగ విహారార్థమై బయలుదేరి
విబుధేంద్రనోడప రాజవీధి వచ్చుచునుండ
నట్టివేడుకఁ జూచునట్టివేడ్కఁ
గలకలధ్వను లెసంగ నగరాంగనలు ప
రిభ్రమింపఁ దొడంగిరి వగలూరి
గీ॥ యప్పుడప్పుంటవాల్గంటియచట నేకు
లను వడకునట్టిపని వీడి తనమతోడి
పడుచులుం దాను వేగిరపాటునఁ దల
నాకిటికి వచ్చి పార్థివేశ్వరునిఁ జూచె.

ఉ. ఆతఁడు దానిఁ జూచె నపుడాతట నిర్వురు వేఁ బరస్పర
ప్రీతిమనస్కులైరి యటుపిమ్మట దాన నుహీనతేశ్వర

ద్వాతవరుండు ధర్మమును బాసి మనంబునఁ గాపువాని సీ
రీతిగ బందికాణ నిడి రేగి బలంబుల వానివారలన్.

వ. పట్టించి తెప్పించి మాలవాండ్రకు వరవుళ్ళుగా నమ్మించి వానిసర్వస్వముం గొల్లగొని కలకంధరఁ దనమందిరమున కుం జేర్చికొనియె. అంతట నాయిడుమల సహింపలేక జన భద్రుం డురివేసికొని మరణింప వానిబంధుజాలంబంతయు సగ్నిప్రవేశంబు సేసె. ఇట్లు కలకంధర యాభూవల్లభునిం జేపట్టి యత్తవారియిల్లు నాశనంబుసేసి యథోచితవిహారం బులఁ గాలంబు గడుపుచుండె నంత.

చ. కతిపయవాసరంబులకుఁ గామ్యశరత్సమయంబు రా మహా కుతుకముతోడ నయ్యెడలఁ గోమలులందరుగూడి యీశ్వర వ్రత మొనరించుచుండఁగని రాజపురోహితుఁ డిల్లు తానునా చితవిధిఁ బూజలన్ సలిపి చేతులు మోడ్చినచించె నిట్టులన్.

సీ॥ ఓపుణ్యశేఖర ! యీపురంబున నుండు
నువిదలందర దెద్దియో వ్రతంబు
నాచరించుచునుండునట్టిజాడలు దోచె
నావ్రతం బెయ్యది ? యన్ని చేయు
నట్టిమార్గం బెద్ది? యందుచే సగుఫలం
బెయ్యది? యద్ది మున్నెవరిచేత
నాచరింపంబడె నావిశేష మెఱుంగ
వేడెద నావుడావిప్రుఁడా వ్ర

గీ॥ తంబు కేదారగౌరీవ్రతంబు దానిఁ
దొల్లి పార్వతి చేసి రుద్రునిశరీర
మందు నర్ధంబుఁ గైకొనె నట్లు పిదప
నమరనారీమణులు పెక్కురాచరించి.

వ. తమమనోరథంబుల వడసిరి. ఇయ్యది పరమైశ్వర్యహేతువు. ఇయ్యది యొనరించినవారికి మోక్షసామ్రాజ్యంబు కరతలామలకంబు గావున దీని నాశ్వయుజశుద్ధదశమినాడు మొదలుకొని యూబహుళామావాస్యపర్యంతంబునధికనిష్ఠామతినాచరింపవలయునని తద్విధానంబంతయు నానతిచ్చి చనియె. అంత నక్కుపుషదంతి యప్పుడమితేనిం జేరి యిట్లనివిన్నవించె.

గీ॥ ప్రాణనాయక ! నావిన్నపంబు వినుము
తనరఁ గేదారగౌరీవ్రతంబు జేరగు
చుండె నీయెడఁ బురి; నదియుత్తమోత్త
మవ్రతంబని వింటి బ్రాహ్మణులవలన.

సీ॥ అట్టిపుణ్యవ్రతంబాచరింపించి నా
దురితజాలముఁ బాఱఁదోలవలయు
ననుచుఁ బ్రార్థింపంగ నతఁ డొడంబడి దాని
కఖిలోపకరణంబు లమరఁ జేయ
నువిద యంతఁ బురోహితోపదిష్టప్రకా
రమున నిష్ఠాత్మ నావ్రత మొనర్చి

యుద్యాపనముఁ జేసె నుత్తరజన్మంబు
నందు దానం జేసి యది నృపాల

గీ॥ తనుజయై పుట్టి నిత్యసత్యవ్రతుండు
నైన శ్రీసార్వభౌమునకయ్యె రాణి
యాసతీమణి యెవ్వరోయనఁగ నేల ?
సరసగుణవతియైనయీ చంద్రమతియె.

ఉ. వాసి వహించునీశ్వరురవంశము పావనరించి పెద్దరా
కాసియనంగఁ బేర్వడయఁగల్గినయీసతి యీభవంబునన్
భాసురమైనయట్టి పితృవంశవినాశిని యయ్యెఁ గాన నే
దోసము దేరికబ్బుటకుఁదొల్లిటికర్మయె కారణంబగున్.

సీ॥ కులశీలములఁ జూడ కెలమి నన్యాసక్త
యైనట్టికతమున సఫలమైన
సంపాదకమగుదుష్టచుహూర్తమున సమ
స్తాడి తాఁ బితృపరిత్యక్తయయ్యె
సర్వదోషంబుల సమయించునట్టి కే
దారగౌరీశవ్రతం బొనర్చ
టంజేసి నిఖిలకష్టముల దాటి నృపాత్ముఁ
డై సట్టిమయునిదయాసనమున

గీ॥ వాసిఁ గాంచుచు నీశ్వరవ్రతమొనర్చు
తోరమును గట్టుకొనుచో నుదారుఁ సతి
నీతఁడే యెన్నిజన్మలకేని నాకుఁ
గూర్మిపతి గావలెనటంచుఁ గోరుకొనియె.

వ॥ అదికారణంబున హరిశ్చంద్రుండై పుట్టినయానీలలోహితుం జెట్టపట్టె. దానిమాయను వానిచుట్టంబులను మాలలకుం దాసులనుగా నమ్మించుటం బట్టి సర్వలోకపూజ్యంబగు నిక్ష్వాకువంశంబునఁ బుట్టినను సత్యవ్రతరక్షణవ్యాజంబున నాతండు మాలవానికి దాసుండుగ విక్రయింపంబడెనని వసిష్ఠుండు చంద్రమతీహరిశ్చంద్రులపూర్వజన్మవృత్తాంతంబు సర్వంబు నానతీయ సుయజ్ఞుండు వెండియు నిట్లనియె.

సీ॥ ఈదంపతులకు మౌనీశాగ్రగణ్య ! మీ
రానతిచ్చినరీతినటులఁ బూర్వ
కర్మంబనుభవింపఁ గలదిమైయుండ వి
శ్వామిత్రుఁ డాత్మతపఃఫలంబు
లో సగం బిచ్చిభూలోకాధిపవరేణ్య
నీరాజు నూరార్చ నేటి కనుచు
నడిగినట్టిసుయజ్ఞు నాలోకనముఁజేసి
యవ్వసిష్ఠుం డిట్టులానతిచ్చెఁ

గీ॥ బూర్వమున సర్వజిత్తనుపుణ్యజనుఁడు
తనదునామంబు భూమి సార్థకముగాఁగ
నఖిలభువనంబులను గెల్చునట్టిబుద్ధి
నమితపావనమేరుశైలమున కరిగి.

గీ॥ అధికనిష్ఠల శంకరుననుసరించి
తపము సేయుఁగ నీశుఁడాదానవునకుఁ

గడు దయారస మొప్ప సాక్షాత్కరించి
కోరినట్టివరంబులఁ గూర్చిచేనిరి.

ఉ॥ అంతట యాజ్ఞవల్క్యనుఁడునావిబుధారివిభుండు సర్వలో
కాంతకుఁడో యనం బ్రబలి యాశరవీరులు కోట్లు కొల్చిరాఁ
బంతముతో సమస్తబుధవర్గము ముట్టడివేయ వార ల
త్యంతభయంబు నొందిరి పురావనరక్షణశౌర్యహీనులై.

గీ॥ అటులఁ గిన్నరసిద్ధసాధ్యసురయక్ష
గరుడకింపురుషాదివర్గముల గెలిచి
తనివి నొందక వరతపోధనులయాశ్ర
మముల భంగం బొనర్పఁ దా మదిఁ దలంచి.

ఉ॥ అంతట సర్వజిత్తనుబుధారిగణాధివిభుండు గర్విత
స్వాంతమునన్ మహోపరగుచాపశరాసుల సాగి పార్వతీ
కాంతుఁ దలంచుచుం బ్రళయకాలపరేతవిభుండనన్ బలా
క్రాంతుఁ డతండు వేఁడెనిమోఁగంజభవాసులు బెగ్గిలంగడున్.

సీ॥ చని మహామునిగణాశ్రమములం జొచ్చి వి
ఘ్నమొనర్చి యాగకుండంబులెల్ల
సాధ్వశిరోరత్నజాలం బపహరించి
యగ్రహారంబుల నణఁచివైచి
భూసురశ్రేణి నిర్మూలించి తద్ధనం
బుల గొల్లవెట్టించి బలిమి నిఖిల
పుణ్యస్థలంబులఁ బోకార్చియును నిట్లు
పలుతెలుంగుల సాధుపులకు భాష

గీ॥ లను ఘటించుచుఁ దాఁ బుణ్యజనదమనుఁడు
నయ్యుఁ బుణ్యజనావనుండగుచు నిఖిల
భువనములకెల్ల నేనె భూధవుఁడననెడి
విషమ శేముషిచే విజృంభిగుచుండె.

ఉ॥ అట్టియెడన్ ధరావలయమందుఁ జెలంగుమునీశులెల్లరుం
గట్టుగ నొక్కెడం గలిసి కర్బురనాయకు లోకకంటకుం
బట్టి వధింప నెట్లనుచు బాగుగ లోఁ గని గాధిపుత్త్రు; జే
పట్టుటయే యుపాయమని వానినిఁ జేరి యొనర్చి దండముల్.

ఉ॥ కౌశిక ! సర్వజిద్దనుజకాంతుఁడు కావర మెక్కి యాగ్రహా
వేశకుఁడౌచు సాధుజనబృందము గాసిలఁ బెట్టఁ బూనె నే
కోశమునందుఁ బ్రాణములకుం దగుశాంతము లేనుమాకు నీ
వే శరణంబు; కావుమని వేడుచు నిట్లని రొక్కపెట్టునన్.

సీ॥ వాని నెవ్వైనఁ జంపంగఁ జూతమటన్న
భూతేశువరబలంబునను జేసి
పరదారహారణుఁడై బహుకష్టకార్యంబు
లొనరింపఁ గల్గినమనుజవిభుని
చేఁ గాని వాఁడు నశింపనేరండట్టి
వాఁడవంతిపురీశ్వరుఁడు నైన
యలనీలలోహితుండనువాఁడొకండు చూ
పట్టుచుండెను; వాఁడువానికమిత
గీ॥ హితుఁడుగా నుండె నయిన నాక్షితివిభుండు
నీకు భక్తుండు గాన వానికి విభేద

బుద్ధిఁ బుట్టించి యాకోణపుని వధింపఁ
జేయఁ దగు నీకనుచు నిన్నుఁ జేరితిమిట.

వ॥ మాప్రార్థన లియ్యకొని దుష్టశిక్షకుం బ్రియత్నింపుము. నావుడుగాధేయుండు మిత్రభేదనంబు సేయ మనంబు గొల్పక కొంతదడవాలోచించి యెట్టకేలకు సాధురక్షణమే ప్రిధానకర్తవ్యం బని నిశ్చయించి యక్కార్యం బంగీకరించి నీలలోహితుం జూడం బోయె. ఆసమయంబునఁ గొల్వుదీరి యున్నయవంతీనాథుండు కౌశికునిరాక చారులవలన నాలించి యెదురేగి సాష్టాంగదండప్రణామంబు లాచరించి తోడితెచ్చి యర్ఘ్యపాద్యంబు లొసంగి యార్హాసనంబున నెలకొనం జేసి యిట్లనియె.

శా॥ సేమంబే మునిచంద్రిమా! తమకుమీశిష్యాళికిన్; శిష్యసం
స్తోమం బేయెడ సల్పునే చరణశుశ్రూషల్; తపోనిష్ఠ లీ
భూమిన్ సాగునె?దుంపలాకులు జలంబుల్ చిక్కునేకానలో
నేమాహాత్ములుచేయకుందురుగదాయీమీ యెడంగష్టముల్.

గీ॥ ఉత్తమోత్తమ ! నేనుధన్యుండనైతిఁ
గాదె తమరాక ; వచ్చినకార్యమిపుడుఁ
దెలుపఁ దడయక వెంటనేసలుపనుంటి
ననఁగ నాతండు కౌశికుండనియె నిట్లు.

సీ॥ అవనీశ! యాలింపుమాశ్రితాభీష్టప్రి
దానంబె కార్యంబు ధరణిపతుల

కందును నీబోంట్ల కది యడుగవలెనా ?
సప్తవ్యసనములసరకుఁ గొనక
యెలమితో సప్తాంగములఁ గాచికొనుచు శా
త్రవమిత్రబాంధుసంతతుల నెఱిఁగి
పగవారిపైఁ దా నుపాయంబు లేడింటిఁ
గూర్చి యామీఁద షడ్గుణము లాశ్ర

గీ॥ యించి రాజ్యంబు సేయుచు నెసఁగుచంద్రు
రాజులగువారు; నీవుసర్వవిషయముల
నప్రమత్తుఁడవై యుండియన్యదార
హితుఁడ నెడునింద మోయఁ గల్గితివి ధరణి.

ఉ॥ దానిఁ దలంగుపొంటె నొకదానినిఁ గోరెద దానిఁజేయఁగాఁ
బూనుము; నేను నీకెపుడుముఖ్యుఁడ; నీపని సేతునంచు వా
గ్దానముఁ జేయు మింత కిఁకధన్యతనీకొకటున్నె?యంచు నా
మౌనివరేణ్యుఁ డాడుటయుమానవనాథుఁడు వాని కిట్లనెన్.

గీ॥ సంయమీశ్వర ! తమయభీష్టం బదెద్ది;
తెల్పుఁడని వేడ నపుడు గాధేయుఁడలరి
సర్వజిత్తును బరిమార్చిసంయమీంద్ర
కులము గాచుటయనఁగ నందులకుఁ నతఁడు.

సీ॥ ఒడఁబడకో తాపసోత్తమ! మీరెట్టు
లట్లె నెయ్యుండు నాకాతఁ డెపుడు
సర్వమిత్రద్రోహ మొనరింపఁ బాడియే
యనఁగ నాలించి యమ్మునివరేణ్యుఁ

డాహితాహితవిచారాను లేమొడఁ బాత్ర
విషయంబున నెకాని వేఱుచోటఁ
బాటింపరాదంచు బహునీతులు వచించి
సాధుచూనీద్రక్షణామె నిఖిల
గీ॥ భద్రమూలంబటంచుఁ జెప్పంగ నంత
నామహీశుఁడు మానీంద్ర! తామ బ్రహ్మ
సృష్టికిం బ్రతిసృష్టిఁ జేసినమహాత్మ
లేరికిఁ వరంబు మీమాట సేయసేయ.

సీ॥ తమశాసనం బింకఁ గలమోసు సర్వజి
ద్వ్యాతుధానాధినాయకునిఁ జంపుతుఁ
గాని నాకంబుకుఁ గాన్కగా నేసనీ
నృలతోడి నిఖిలభూపాలయముననను
నేనొక్కరుండనె యేలిక గా వరం
బిషుడంచుఁ బలుక్క నాపుణ్యమిట్టిని
కాకాశికుండు నీయభిమతం బీభవం
బున ఫలింపఁడు కాని మునుగాజన్మ
గీ॥ మునను నీజన్మలోఁ బుణ్యమున నె ఘాను
కులమునఁ ద్రిశంకుసుతుఁడనై కలిగి యుహిత
సత్యనిత్యుఁడనై హరిశ్చంద్రనామ
మున వసంతును నీయిష్టము లపు వోదప్పు.

వ॥ అనిచెప్పి సర్వజిత్తుపై దండెత్తి సన్నద్ధుం గావించి యాంగల
కుం దగుదివ్యాస్త్రంబులు ప్రయోగోపసంహారపూర్వకంబు
లుగా నుపదేశించి నిజాశ్రమంబున కేఁగె.

ఉ. అంతట నాథరాధిపుఁడు నాపగరాని యసూయ వాహినీ
సంతతు లుబ్బునం బలసి సన్నుతి సేయుచుఁ గొల్చిరాగ ర
వ్వంతయు భీతి లేక రణవాద్యములన్ జరిపించె నట్టివృ
త్తాంతము సర్వమున్ నిజభటావళిచే విని లోనఁ నల్కచే.

గీ॥ కాలి తాఁపునఁ గెరలు నాగంబుఁబోలె
బుసలఁ గొట్టుచు నిజమంత్రిపుంగవులను
గాంచి నీలలోహితునిదుష్కార్య మిపుడు
వింటిరే మీర లేమని విన్నవింతు.

గీ॥ క్షీరములవంటి నాముద్దుచెలిమి నేలఁ
గలిపి జడదారు లాడిన పలుకులు విని
యెగ్గులగ్గునెఱుంగక యిపుడు సమర
మునకు నామీఁది కరుదెంచు పోల్కి దోఁచె.

ఉ॥ కావున వాని నింకెటులఁ గాచెదు యత్న మదేటికంచు సై
న్యావళితోడ నాడుచు బుధారివిభుం డతికోపమూని ధా
త్రీవలయంబునన్ నృపవరేణ్యులు భీతిల యుద్ధభేరికా
రావము లెల్ల దిక్కుల భరంబు ముతోఁపఁగ నింపె నొక్కటన్.

సీ॥ అంత నాభూపుండనంత సేనాసమ
న్వితుఁడై నిజపురంబు నిర్గమించి
త్రోవలో నెడనెడం దోఁచు మంగళనిమి
త్తంబులం గాంచి మోదంబుతోడ
నడుచుచుం గొన్నిదినంబులకలజన
స్థానంబుఁ బ్రాపించి సకలసమర

భేరిప్రముఖవాద్యఘోరధాంధణ
నాదముల్ దిక్కుడ్యభేదనంబు

గీ॥ సేయ నగరంబు నాక్రమించె నట దనుజ
ముఖ్యుఁడాశరబలముతో మోహరించి
యెదురుగా వచ్చి నిలిచె నయ్యెడల నిట్టు
లుభయసైన్యములకు గొప్పయుద్ధమాయె.

సీ॥ ఉద్దండతరవీరహుంకారములు ధను
ష్టంకారములు హాస్తిఘీంకృతులును
రథనేమికామహారావంబులు మహోగ్ర
కరశరాద్యాయుధగణరవములు
బహుయుద్ధభేరికాపటహాభాంకృతు లుబ్బి
భూనభోంతరములబోరుకొల్పి
ప్రళయపారావారరావంబనుకరింప
నెక్కటిజోదులు నిక్కుమెఱయ

గీ॥ ప్రదరకుంతలతోమరపట్టిసాసి
ముఖసమస్తాయుధవిఘాతములకు లోను
గాక వింశతిదినములు, గట్టిబాటు
తనములను లేనిపోరుసల్పునెడ సచట.

సీ॥ ఆయుధద్యుతిసముదాయోదయద్వాద
శాహస్కరప్రకాశంబు వేగ
గతిశిలీముఖజాతఘనవాతజాతంబు
తురగవారణరథోద్ధూతధూళి

జీమూతవారంబు లై మహాభటసింహ
నాదగర్జానిక్వణంబునగుచు
ధానుష్కసంప్రయుక్తశరధారావర్ష
మతిశయింపఁగ మదేభాళిభూధ
గీ॥ రములు నరదానవశరీరరాజిఘోర
మీనములు మహాస్యందనయానపాత్ర
ములు హయోత్తుంగతరభంగములును గలిగి
పరమశోణితవిలయార్ణవంబు పొంగ.
గీ॥ అతిరథమహారథాదిసమన్వితంబు
లై యుభయపక్షసైన్యంబులంత మొంద
నలరి బురణించుభూతార్భటులు మనములఁ
గలఁతఁ బెట్టఁగ సంగరాంగణముజూచు
నట్టివారికి భీషణంబై చెలంగె.
ఉ॥ అప్పుడు నమ్మనుమ్యదనుజాధివిభుల్ పొలివోనిబీరముల్
గుప్పుచు దంద్వయుద్ధమునకుక్ సమకట్టఁగ మింట దేవతల్
దిప్పలు మాకు మానులకుఁ దీఱె నటంచని సంతసంబుతోఁ
గుప్పలుగుప్పలై కనుటకుక్ సభఁదీర్చిరి యొక్కపెట్టునక్.
ఉ॥ అంతట రక్కసుండు మదినల్కవహించి నృపాలుఁ జూచి నీ
యంతటిదుష్టుఁ డీభువనమందు జనించునె ? మానులాడువా
క్స్రంతతి నాలకించి మనసఖ్యముఁ ద్రోసితి వింక నాయుమా
కాంతుఁడు నష్టమైన నినుఁగాలునివీటికిఁ బంపకుండునే.
సీ॥ అని బెట్టిదంబుగానాడి తీవ్రశరంబు
లతిశయంబుగ నింప నతనిమేన

నాతఁడు నౌనంచునాశరాధిపుముల్కు-
లెంచి మర్మముల నాటించి నొంచె
నీరీతిఁ బోరి తా మిర్వురుం బిదప ది
వ్యాస్త్రప్రయోగంబులందు మెత్త
బడకుండఁ బోరుచో నడరి రాత్రిచరుండు
పలుజత్తుల నటింపఁబార్థివుండు

గీ॥ వన్నిగాధేయదత్తదివ్యాస్త్రమహిమ
నంతమొందించి యలిగి బ్రహ్మాస్త్రయోగ
మున నె కడతేర్చె నారాక్షసుని; యశంబు
నద్దెసలనిండె లోకమానంద మొందె.

గీ॥ అమరవర్షితసుమవర్షమతిశయించె
గాధిపుత్రుండు నిజశిష్యగణము గొలువ
నచ్చటికి వచ్చి మచ్చికనానృపాలుఁ
గౌగిటం జేర్చి తగినట్లు గారవించె

గీ। దిక్పతులతోడ నారాజతిలకుఁ గాన
వచ్చినట్టిసురేంద్రునివలన నమృత
వృష్టి గురియించి రణభూమి విగతజీవు
లైనసేనలఁ బ్రదికించె నాతఁ డపుడు.

సీ॥ అంత నాభూపుండుహరిహరబ్రహ్మది
దేవాధినాథగాధేయముఖ్య
మానిచంద్రులకృపామహిమచేఁ దేజస్వి
యై బలంబులు గొల్చియరుగు దేర

సమరనాథునివై భవమున నాత్మనగరం
బున కేగి సుముహూర్తమునఁ బురప్ర
వేశంబుఁ జేసి తా వేడ్కతోఁ గలకంధ
రాభిఖ్యఁ గలిసి సౌఖ్యాంబురాశిఁ

గీ॥ దేలుచుండెను కావున నోలి గాధి
పట్టి యితనికి నిజతపఃఫలములందు
నర్ధమును బంచి యిచ్చువాఁడయ్యెనిఖిల
సురగరుడసాధ్యయక్షకిన్నరులు పొగడ.

వ॥ అని చెప్పినయరుంధతీజాని వీక్షించి సుయజ్ఞుండు మహానిందా! సద్గుణవంతుండగునీలోహితాస్యుం దక్షకాహి నిజవిషాగ్నులం బేర్పనేల తద్విషయం బానతిందు నా వసిష్ఠుం డాతని కిట్లనియె.

సీ॥ పూర్వంబునాకానోకప్పుడుఁ దక్షకుం డింద్ర
దర్శనోత్సుకుఁడై త్రిదశనగరికిఁ
జనుచుండఁ దత్సుతుండును దోడ నరుగుచు
నలకాపురముచెంతనిలిచిదాని
విభవసందర్శనాపేక్ష సంచారంబు
సల్పుచు రంభానిశాంతమునకుఁ
జనుచున్ననలకూబరునకు నడ్డంబుగాఁ
బఱచె దానిం గాంచి యరుగునతఁడు

గీ॥ నహి పథంబున నాగుటనర్థమూల
మనుచుఁ దలపోసి యాత్మకరాసి దాని

నటికి పడవైచి చేనియోఁ దా వెఱపులేక
పట్టరానట్టిమోహభావపరవశత.

గీ॥ చింతల ఘటించునట్టివృత్తాంత మపుడుఁ
గలహభోజునివలనఁ దక్షకుఁడెఱింగి
యంతరంగంబునందుఁ గోపానలంబు
ప్రజ్వరిల్లఁగ నలకాపురమున కరిగి.

గీ॥ అచట ఖండింపఁబడి చచ్చినట్టికొడుకు
గాంచి తాఁ గొంతతడవు శోకించియంత
తెలివి వహియించి దుర్వారతీవ్రకోప
పావకజ్వాల లుబ్బఁ దాపంబుఁ జెంది.

గీ॥ అనిలముం గ్రోలి బ్రదుకునీ యహితనూజుఁ
బాపమవ కిట్లు కరవాలుపాలు జేసి
చనినపాలసుఁ డట మర్త్యజగమునందు
మనుజుఁడై పుట్టి నేముట్ట మడియుగాక.

వ॥ అని శపించి శచీంద్రునివలనఁ దాఁ బడసినమృతసంజీవనమణి
ప్రభావంబునఁ బుత్త్రుని బ్రదికించుకొని నిజలోకంబునకుం
జనియె నంత.

సీ॥ ఆవర్తమానంబు నాలించి కౌబేరి
యంతరంగంబునఁ జింతనొందు మఁ
దనసతీమణి రంభ తనవెంట రా దాని
చెలియైనమేనక కెలమిఁ గూర్చు
చెలువుండు నాటఁ గౌశికుఁడు తన్ను నిజంబు
గాఁ గావఁగలఁడంచుఁగడఁగు వాని

మరుగుఁ జొచ్చి నుతింప మాన్యుఁ డామునివరుం
డతికృపారసచిత్తుఁ డగుచు నన్నుఁ

గీ॥ దక్షకునిశాపమున నగుత్రాస మెటులఁ
దొడరనేరదు వినుము మర్త్యుండొకండు
క్ష్మాతలంబున శ్రీహరిశ్చంద్రనృపతి
కినిఁ దనుజుఁడౌచు నీయంశమున జనించి.

వ॥ తక్షకదష్టుండై మడిసి సత్యవ్రతనిష్ఠాగరిష్ఠులగుతల్లిదండ్రుల పుణ్యంబునఁ బునర్జీవితుండై పెక్కేండ్లు భూపరిపాలనంబు సేయం గలండు కావున నీవు చింతిల్లక పొమ్మని యనుగ్రహించె. దానం జేసి లోహితాస్యుండు నలకూబరాంశంబున భూతలంబున జనించి తక్షకదష్టుండై మడిసి మరల బ్రదికెనని వసిష్ఠుం డానతీయ సుయజ్ఞుండు సంతోషపరవశుండై కాలుండు చండాలుండై జనింపనేలయని యడిగిన నవ్వసిష్ఠుండు తాపసగరిష్ఠుండగు నాసుయజ్ఞున కిట్లనియె.

సీ॥ ఆలింపు మోసుయజ్ఞాభిఖ్య! యీహరి
శ్చంద్రునితండ్రి త్రిశంకుఁ డితనిఁ
బట్టభద్రునిఁ జేసి,పరమపావనమదీ
యాశ్రమంబునకుఁ దా నరుగుదెంచి.
గురువర్య ! నేనన్నికోర్కుల విడనాడి
యిహసుఖంబుల రోసి యీతనువున
నింద్రలోకముఁ జేరనిపుడు నిన్నాశ్రయిం
పఁగ వచ్చితిని నాదువాంఛదీర్పు

గీ॥ మనుచు నను వేడ నేనదియమరదనుచు
నడ్డగింపంగఁ గ్రోధించి యపుడు గురుపు
లనుచు మిమ్ము వేడుటకంటె నాశ్రితావ
నుఁ డగుగాధేయువేడుకొనుటయె మేలు.

క॥ అని నన్నుఁ బూలనాడఁగ
మనమున నేనంతుకలిగి మంచిచెడులెఱుం
గనిమతి నిట్లంటివి కా
వునఁ జండాలుఁ డవు కమ్ము భువి నీవనినన్.

ఉ॥ అంతట నానృపుండు తనయందలి మాలతనంబు సిద్ధమై
నంతనె గాధిపుత్త్రకునియాశ్రమభూమికి నేగుదెంచి నీ
యంతటివాఁడు గాధితనయా! మఱియొండును లేదరుంధతీ
కాంతుని యాగడంబులనె కాంచితి నీతను వేఁడ్రినోంకుఁడన్.

చ॥ ననుఁ గరుణించి దేవభువనంబును బొందుపథంబుఁ జెల్పవే
యని వినుతింపనియ్యకొనియాదుల కామునిచంద్రుఁడాత్రితో
నిను నిటుఁ జేసినట్టియలనీగురుఁ డౌనని మెచ్చ నిన్ను నీ
తనువునఁ బుచ్చెదన్ విబుధధాత్రికిఁ బొమ్మతిసత్వరంబునన్.

వ॥ అనియొక్కదివ్యమంత్రం బుపదేశింప నమ్మంత్రప్రభావంబు
నం జేసి త్రిశంకుండు జెంకుమాని కొంకులేక మింటికిం జని
స్వర్గద్వారంబుఁ బ్రవేశింపఁబోయె నచ్చట.

గీ॥ అమరపతిఁగొల్వవచ్చినశమనుఁడంత
నెవ్వఁడీమాలఁ జెదభయంబేమిలేక
యమరపురిఁ జొరఁబడియెడిననుచుభటుల
వలనఁ ద్రోయించెఁ దలక్రిందుగలుఁగ నిలకు.

సీ॥ అతఁ డంతట నధఃపతితుఁడౌచు గాధేయ!
నీమానపాటింపకాయముంచు
నిలఁ బడనన్నుఁ(దో)యించె! నిందుకుఁబ్రతీ
కారంబు నారసి కావఁగదవె
యనిఁ మొఱయిడఁ దొడఁగెను తదార్తరవంబు
విని కౌశికుఁడు దానఁగినిసి తపముఁ
జాలించి జపమాలనేలవైచి కమండ
లంబుతో వేణుదండంబుతోడి

గీ॥ బాహుదండంబు నెగఁజాచిపార్థివేంద్ర!
ధరణిపైఁ బడ నీకేల తడబడ కిఁక
నిలువు మటఁ దలక్రిందుగా నీవు నిలుచు
నుర్వి స్వర్గంబె కాని వేఱొండు గలదె?

సీ॥ అనుచుఁ దాఁ జేనుదెంచియాత్మీయగంభీర
ఘనతపస్సామర్థ్యమున సమస్త
నాకవాస్తవ్యుల నాకర్షణ మొనర్ప
యత్నించుటయును బ్రహ్మాండమెల్లఁ
గంపింప బ్రహ్మ యాఘనునిఁ గానఁగ వచ్చి
యప్పటి కాకృష్టులైనవిబుధ
గణముతోఁ గతిపయగ్రహతార లమ్మహీ
శ్వరుని వేష్టించి నిల్వంగ నీతఁ

గీ॥ డున్నచోటఁ ద్రిశంకుదేవోర్వి యనఁగ
నగ్రగణ్యత్వ మొంద ననుగ్రహించి

యతనికోపంబుఁ బాపి తా నరిగె సత్య
లోకమున కప్పుడాదిత్యులు వినుతింప.

వ॥ అప్పార్థివుండు నాటంగోలె విశ్వామిత్రమహిమప్రదర్శకుండై
గగనభాగంబునఁ దలక్రిందుగ వ్రేలుచుండె నంత.

గీ॥ దానఁ దనియక కౌశికమౌనివర్యుఁ
డూని యిలఁ గాలుఁ జండాల యోనిఁబుట్టు
మని శపించి యతండు పాదాంబుజముల
వ్రాలి శాపాంతమును వేడ జాలికలిగి.

సీ॥ నాకు నీవు హితంబొనర్చి యీశాపంబు
నుండి యంతట విముక్తుండవగుమ
టంచుఁ బేర్మి ననుగ్రహించెఁ గావున సూర్య
పుత్రుండు కడజాతిఁ బుట్టినట్టి
వీరసేనునకుం గుమారుండగుచు వీర
బాహునామంబున వసుధఁ బుట్టి
యీహరిశ్చంద్రభూమీశు దాసునిగఁ దాఁ
గొని కౌశికున కిష్టమును ఘటించి
గీ॥ వేడ్క నాశాపమున నుండి వీడుకొనియె
నన సుయజ్ఞుండు దానిని విని సురేంద్ర
జాలవందితచరణ! యీకాలకౌశి
కుండుగానేటికి శనైశ్చరుండు వచ్చి.

గీ॥ అనుచుఁ బ్రశ్నింప నాసుయజ్ఞునకు నిట్టు
లనియె నావమౌనికులచంద్రుఁడనఘ! తొల్లి

త్వష్ట్రపుత్త్రిని సంజ్ఞాభిధను గుణాఢ్యఁ
బ్రీతితోఁ బంకజాప్తుండు పెండ్లియాడి.

క॥ మనుదండధరుల నిరువురు
తనుజుల నద్దానివలనఁదాఁ బడసి సుఖం
బున నుండఁ బుట్టినింటికిఁ
జనుటకు యత్నించి సంజ్ఞ సంతోషమునన్.

సీ॥ తనచాయ నొక్కలేమను జేసి చాయయం
చని పేరువెట్టి చెల్వొని సుతులనుఁ
గావఁ గట్టడఁ జేసి కాంతునకుం జెప్ప
కయ పోయె; నిటఁజాయకమలబాంధ
వునకుఁ దా నన్యయాటను బోధపడనీక
మెలఁగుచు నాతనివలనఁ గడకు
వరగుణాఢ్యు లగుసావర్ణశనైశ్చరు
లనుకుమారులఁ గాంచికనికరంబు

గీ॥ వీడి సంజ్ఞాతనూజులఁజూడకుండ
నందులకు నొప్పక యముండుసందుఁజూచి
విసికి యలశనైశ్చరుఁ గాలువిఱుగనడిచెఁ
బట్టరానట్టియధికకోపముననపుడు.

గీ॥ ఇనుఁ డెఱిఁగి దాని చాయను గినిసి సంజ్ఞ
పోకదెలిసి తురంగిమై భూతలమున
వరకురుక్షేత్రవనమధ్యఁదిరుగుదాని
యందు నశ్వినులనుగాంచి యందువలన.

క॥ తననిజరూపంబును బొం
దినసతిఁ దోడికొని చనితొమెదివమున; కాయ

శ్వినులు బుధవైద్యులై కీ
ర్తినిఁ గాంచి చెలంగి రచట దివిజులు పొగడన్.

సీ॥ అంత సంజ్ఞాదేవియాత్మాత్మజులకు ని
ట్లుపకార మొనరించినట్టిచాయ
యందీసుచే దానియాత్మోద్భవు శనైశ్చ
రుని భూమిపైఁ బడందోసియ నతఁడు
నైమిశారణ్యపుణ్యక్షేత్రమునఁ బడి
యంతకుండు విఱుఁగనడచినట్టి
పాదమూడి పడంగఁ బంగువై యందలి
ఘనతపంబొనరించు కౌశికముని

గీ॥ వర్యునిం జేరి యాతనివలన మిగులఁ
బరమమంత్రరహస్యంబు లెఱిఁగి చాల
కాల మనశనదీక్షచేఘనతపంబుఁ
జేసి గ్రహపద మొందె జేజేలు పొగడ.

గీ॥ కావున శనైశ్చరుఁడు గాలకౌశికుఁడయి
పుట్టి కౌశికునకుఁ బ్రియంబును ఘటించె
నని వసిష్ఠుండు నాసుయజ్ఞునకుఁ దెల్ప
నమ్మునీంద్రునిఁ బూజించి యతఁడు చనియె.

గీ॥ అంతట నరుంధతీజానియమ్మహీశ్వ
రునకు బోధించి తగునీతులను; నిజాశ్ర
మమున కరుదెంచెఁ గడు గౌరవములఁ దన్నుఁ
బంపఁ బూజలొనర్చి యాపార్థివుండు.

వ॥ ఇవ్విధంబున హరిశ్చంద్రసార్వభౌముండు గురుండగునరుంధ
తీశ్వరుని విశ్వామిత్రశిష్యుండగుసుయజ్ఞునిం దత్తన్నివాసం

బులకు వీడుకొలిపి సత్యకీర్తిసాచివ్యంబున సత్యకీర్తిప్రతి ష్ఠాతయు నాశ్రితాభీష్టదాతయుఁ బ్రకృతిరంజకుండు నై యప్పుండరీకాక్షునిచందంబున సర్వసర్వంసహాసముద్ధరణ చణుండై శచీందుఁడునుంబోలె నిఖిలవైభవోపేతుండై బహుయజ్ఞంబులొనరించి చిరకాలంబు రాజ్యపాలనం బొనర్చె నప్పుడు.

సీ॥ జారచోరులు దురాచారాన్యదూషకుల్
పాషండదీనలుబ్ధపిశునకులు
గలికంబునకునైనఁ గానరారు పతివ్ర
తలు గానిసతులుఁ భూధవునికార్య
తత్పరు ల్గానిభృత్యవ్రజంబులు మాతృ
పితృభక్తిహీనులౌసుతులు లేరు
శశవిషాణంబయెచూడఁజూచిన బాల
మరణంబు సాకేతపురమునందు

గీ॥ నిట్లు సామ్రాజ్యమొనరించియానృపాలుఁ
డంతమునఁ బుణ్యవాసవార్థాసనంబుఁ
బొందె నిప్పుడు గీర్వాణబృంద మచట
నొనర వినుతింప హర్షించుచున్నవాఁడు.

క॥ ఈతనిచరితము విన్నం
జేతోమోదంబు గలుగుక్షితిలో మనుజ
వ్రాతములు నిఖిలవిభవో
పేతులు గాగలరు మదిని భీతులడంగన్.

### ఆశ్వాసాంతము.

చ॥ మునిగణపుండరీకవనపుష్కరబాంధవ! రుద్రవారిజా
సనసురనాథకింపురుషచారణసంస్తుతసర్వలోకపా
వనతరదివ్యనామ! రవివంశకులాంబుధిసోమ! సర్వభ
క్తనివహకల్పభూమిజ! జగన్నుతసత్కరుణారసార్ణవా!

చ॥ సరసిరుహాసనాదిసురసంచయవందితచారుపాదపం
కరుహ! సమస్తయోగిమునికాండహృదంబుజసీమగేహ! క
ర్బురనివహాగ్రభోగిఖగపుంగవ! భూమిసుతామనోజ్ఞభా
స్కర! వసుధాంబరాంతరలసత్కమనీయయశస్సుధాకరా!

స్రగ్విణి॥ శ్రీరమాహృదయరాజీవసంచార! గం
భీరసాగర! మహామేరుధీరా! మహో
దార! సర్వజగదాధార! నీలాంబుదా
కార! సద్గుణగణాగార! పీతాంబరా!

### గద్యము.

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షసమాదితచతుర్విధకవిత్వ
చాతుర్యశతావధాన్యుభయభాషాప్రవీణేత్యాదిబిరుదాంకిత
రత్నాకరవంశపయఃపారావారరాకాసుధాకరనైఖాన
సకులతిలకరంగాచార్యపుత్ర రాజమాంబావధూటికా
గర్భశుక్తిముక్తాఫలానంతాచార్యకవిప్రణీతంబగు
నుత్తరహరిశ్చంద్రకావ్యంబున ద్వితీయాశ్వా
సము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ